








# పేద్ద దొంగలముఠా అరెస్టు!

## సూట్‌కేస్ సహాయం లేకుండా కట్టుపంచెతోనే గేమ్సుబాండు పట్టుకున్న వైనం !!

**ప్రఖ్యాత తుమ్ముశుభకారి శ్రీ వెంకట్రువణ్ణి దొంగల్ని పట్టుకోడంలో ఎంతో సహాయపడ్డట్టు వార్త!**

రాజధాని, కార్తీకం 20

శ్రీ గేమ్సుబాండ్ పురోహితుడి వేషంలో దొంగల ముఠా స్థావరం చేరుకున్నారు. అదే సమయంలో శ్రీ వెంకట్రువణ్ణి తుమ్ముకోసమని అక్కడికి ఎత్తుకొచ్చి రాబట్టారు. అప్పుడు గేమ్సుబాండ్ మెరుపులా దొంగలపై దూకి చిత్తుగా ఓడించారు దొంగ నోట్లు, బంగారం, యంత్రాలు పట్టుకున్నారు. శ్రీ గేమ్సుబాండ్

శ్రీ గేమ్సుబాండ్ మరియు శ్రీ తుమ్ముశుభకారి వెంకట్రువణ్ణి దొంగల్నందర్నీ పట్టించి స్టేషన్నుండి బైటికి వస్తున్న దృశ్యం

**అభినందన సందేశాలు -**

శ్రీ గేమ్సుబాండు చాలా చాకచక్యంగా దొంగల్ని పట్టుకున్నా

(ఇంకా ఉంది)

# బెంగాల్ లేంప్సు

## ఫ్లూరసెంట్ ట్యూబులు



ఎక్కడెక్కడ ప్రకాశవంతమైన
వెలుగు కావాలో అక్కడంతా అవసరం

**జి.ఎ.పరశురామ్ & కో., హైదరాబాద్-4(A.P.)**

# ఉత్తరాలు

## కథలు

8—9—72 సంచికలో వున్న కథలలో 'దాస్యం ముకు దైర్యలేదు'—కథ బాగుంది. భారతమ్మల్లాంటి వారి మణులు ఈ భారతదేశంలో కోకొల్లలు, ఇటు వంటి వారి జీవితానికి విముక్తి లేదు.

—యస్. యుగంధర్. (కరీం నగర్)

*      *

మధుసూధనరావు గారి లేఖపై విమర్శలు చదువు తున్నాను. ముఖ్యంగా 15—9—72 సంచికలో శ్రీ. స్వతంత్ర తిరుపతి గారు చాలా చక్కగా విమర్శించారు—ఆవిడతో, నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను—శ్రీయుతులు అనేది ఒక గౌరవమైన పదము. గౌరవంగా శ్రీయుతులు.... అని ఒక వ్యక్తిని సంబోధించడంలో తప్పేమి లేదు. స్వతంత్ర గారు చమత్కారంగా 'శ్రీయుతులు మధుసూధన రావుగారి ఉత్తరముచదివాను' అన్నారు. బహుశ శ్రీయుతులు మధుసూధనరావుగారు గమనించే ఉంటారు.

—వి. జె. స్వామి, (భువనేశ్వర్)

## వ్యాసాలు

ఆకుండి నారాయణ మూర్తిగారు — కూరల గుణాలు, రాసేరు. ఇప్పుడు పథ్యాపథ్యములు రాస్తున్నారు.ఎన్నో సంగతులు తెలుసుకో కలుగుతున్నాము. ఇలాగే— పూవులు—వాటి గుణాలు రాస్తారని ఆశిస్తున్నాను.

—ఉపాధ్యాయుల అన్నపూర్ణ, (బరంపురం)

*      *

శ్రీ కే. శే. జా. వి. నరసింగరావు గారి మరణము హఠాత్తుగా విని మేము చాలా బాధపడితిమి. మన దేశము, ఒక త్యాగమూర్తిని, ఒక మహత్తరవ్యక్తిని కోల్పోయినందులకు చింతించు చున్నాము.

—శ్రీ సీతారామ ఫ్రెండ్స్ యూనియన్, (సింహాచలం)

*      *      *

శ్రీ జి. సుందరరెడ్డి గారి ఆధునిక సాహిత్యంలో 'మతనిరపేక్ష—ప్రజాస్వామ్య— సమాజవాద ప్రవృత్తులు' అనే సీరియల్ వ్యాసం బాగా వుంది.

కానీ ఆయా కవుల కృతులుకూడా చెప్పటం సమంజసమని తోస్తుంది. చాలా మంది నేటి పాఠకులకు ఆధునిక సాహిత్యానికి కొత్తవారికి సి. విజయలక్ష్మి, బైరాగిపేర్లు కొత్తవిగా వినిపిస్తాయి. విజయలక్ష్మి, 'విషాదభారతం' 'కారుచీకట్లో కాంతి రేఖలు' పుస్తకాలు వున్నట్లు తెలియదు. బైరాగిని చాలా మంది మరచిపోవటం విచారకరం.

—మనోహర్, (కావుగల్లు)

*      *      *

ఇజ్రేల్ తో ముఖాముఖిగా తేల్చుకొనలేక, పిరికి పందల వలె, అరబ్—గెరిల్లాలు మ్యూనిక్‌లో అమాయకులను పొట్టన పెట్టుకోగా, ప్రపంచ మంతా కలవరము పుట్టినా, మన నాయకులు పూర్తి సమాచారము అందలేదని ఏదో చిన్నమాటలతో సరిపుచ్చారు.

ఈ అరబ్— రాజ్యాలు మనకేమయినా ఒరగ పెట్టాయా, అంటే అదీ లేదు. పైపెచ్చు మన శత్రుదేశమయిన పాకిస్తానుకు పూర్తి మద్దతు ఇస్తున్నవి.

కాని, మ్యూనిక్ దురంతరమునకు ఇజ్రేల్ ప్రతి

హల్లో - హల్లో డాక్టర్
బేజారౌతున్నది మనసూ
చూడండి సార్ పల్సు!!!






రామకృష్ణా • ఎన్.ఏ.టి. కంబైన్స్ వారి

# కులగౌరవం

కథావిధానము • చిత్రీకరణ పర్యవేక్షణ: ★ నిర్మాత:

**యన్.టి.రామారావు. బి.ఏ. ★ త్రివిక్రమరావు**

ఛాయాగ్రహణం: మార్కస్ బార్ట్లే ★ దర్శకత్వం: పేకేటి శివరాం. బి.ఏ.

ఆంధ్ర: … విజయా పిక్చర్స్ • నైజాం: శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్



# ఉత్తరాలు

కాశ్మీర్ సమస్యను ఇండియా ఎంత కఠినముగా ఖండిస్తుందో మీరే వేచి చూడండి.

మ్యూనిక్ దురంతరము — దాని పర్యవసాన ముగకు ఐక్యరాజ్య సమితిలో ఇండియా ఎంత, గట్టిగా అరబ్—రాజ్యాలను సమర్థిస్తుందోగూడా వేచి చూడవలసిన సమయం వచ్చింది.

—జె. బి. జి. సుందర్రావు, (గుంటూరు)

* * *

నేను ఉపాధ్యాయుడను కాను అయినా 1—9—72 మీ పత్రికలో బి. ఎ. కే. వాగభూషణంగారు వ్రాసిన శీర్షిక చదివి మిగుల విచారించితిని. ఎందుకంటే మొదలు గురుబ్రహ్మ అని మొదలుపెట్టి గురువును అంతగా నిందించుట సమంజసముగాలేదు. కొందరు టీచర్లు పెద్దవారి అభిమానం పొందుటకు తాము వాళ్ల పిల్లలకు చెడు అలవాట్లు నేర్పుతారనడం తప్పు. ఎందుకంటే అది వారి అభిమానం పొందుటకు కాదు. వారిపై భయముకొద్దీ చేసేపని. కాపీ కొట్టడానికి వీలు పడకుండా చేస్తే తమ గురువుగారి ప్రాణాలను సహితము తీయుటకు వెనుకంజ వేయని విద్యార్థులు కేవలము వారి వలనే చెడిపోవుచున్నారనడం తప్పు, అయినా కొందరు ఉపాధ్యాయులు కాపీ కొట్టడానికి వీలు కల్పించుచున్నారంటే కేవలం అలా చేస్తైనా తమ విద్యార్థులు ఉన్నతులగుదురను ఆశతో. ఈనాడు పరీక్ష రోజులలో విద్యార్థులు తమ ఉపాధ్యాయులను ఎట్లు హింసించు చున్నారో పేపర్లలో చదువు చున్నాము. ఆఖరిలో 'ఉపాధ్యాయులు వారిపై దండయాత్ర ప్రారంభించవచ్చు.' అనిరి కాని విద్యార్థులు కొట్టినా ఉపాధ్యాయులు వారిపై అభిమానము కలిగి యుందురు.

డి. బోసు. (డొంక రాయి)

పై వారమే!

దసరా

సంచిక

వెల మామూలే!


# ఆంధ్రపత్రిక
# వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం : 13-10-72
(శ్రీపరీధావినామసం॥ అశ్వయుజమాసం॥ శు॥ షష్ఠి
సంపుటము : 6౦ సంచిక : 5
స్థాపితము 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు - 1
విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక

కాంగ్రెసు కుడి

ఎడమ

సరిత్రాసు ప్రదర్శన

కాంగ్రెసుప్రభుత్వం నల్లధనాన్ని తప్పకుండా నిర్మూలిస్తుంది

నిజంగానండీ! అయితే అప్పుడు తమపార్టీకి పెట్టుబడి ఎవరు పెడ్తారు?

రణాల వల్ల క్రాంతి

ఆం.ప్ర. కాంగ్రెస్

నేను పండించినదాన్ని అతనుకోసుకెడుతున్నాడు

చైనాతో సయోధ్యకు మార్గం

జపాన్

తైవాన్

# హైదరాబాద్ నోట్‌బుక్
## తిరుమల రామచంద్ర

### రోడ్—మిడిల్ రోమియోలు !

పాపం! మనరాష్ట్రపతి ఏ నగరానికి వెళ్ళినా 'నగరాన్ని పరిశుభ్రంగా ఉంచుకోండి, అందాన్ని చెడగొట్టకండి' అని సలహా యిస్తూంటారు! సెప్టెంబర్ 10వ తేదీన హైదరాబాద్ పౌర సంక్షేమ సంఘం సభ్యులు సంఘ ప్రధాన పోషకులైన మంత్రి శ్రీ కె. ప్రభాకరరెడ్డి నాయకత్వాన వెళ్లి తమ సంఘ కార్యకలాపాలు, తెలిపినప్పుడూ ఆ సలహానే యిస్తూ 'హైదరాబాద్ నగరాన్ని దేశంలోని అన్ని నగరాలకన్నా పరిశుభ్రతమ నగరంగా చేయండి' అన్నారు.

జంటనగరాలు పర్వత నగరాలు కావడం వల్ల సహజ సుందరాలు. అమధ్య ఒక ఫిన్‌లెండ్‌కవి అన్నట్టు నగర మధ్యలోని కొండలు. పెద్దగుండ్లు ప్రాచీన దేవతలను తలపిస్తూ, చిన్నసైజు 'గ్రాండ్ కాన్యాన్' లాగ ఉంటాయి. కాని మన భూతదయ మితిమీరి రోడ్ సైడ్ రోమియోలలాగ వృషభరాజ్‌లు, మహిష మహారాజాలు ప్రధాన వీధుల మధ్య సయ్యాటలు ఆడుతూ ఉంటాయి. వాటివల్ల ఎన్ని ప్రమాదాలు జరుగుతాయో, జరిగాయో చెప్పనక్కర లేదు. పరిశుభ్రత మాట ఎలా ఉన్నా ఈ రోడ్—మిడిల్ రోమియోలను తొలగించడానికి విజయవాడ వీధుల పునర్నిర్మాణానికి ఉద్యమం లాగే మరొక ఉద్యమం ప్రారంభమయితే బాగుండును!

### నదండోనచ దాండికః!

ఉడిపి పేజావర్ మఠాధీశ్వరులు శ్రీ విశ్వేశ తీర్థులవారు సెప్టెంబర్ 17వ తేదీన ఆనందనగర్ కాలనీలో జరిగిన సమావేశంలో ప్రసంగిస్తూ మనం స్వతంత్రులమై పావు శతాబ్ది గడిచినా, ప్రజలలో ధర్మ ప్రజ్ఞా జాగృతి కలుగకపోవడం విచారకరమన్నారు! 'అన్నం బట్టా లభిస్తుందా లేదా అన్నది ప్రశ్నగాని, ధర్మం ఏందుకు? దాని ప్రయోజనం ఏమిటి? అని నేటి యువకులు తరచు ప్రశ్నిస్తూ ఉంటారు. కాని ధర్మ ప్రజ్ఞ జాగృతం కాకపోతే ఏ విధమయిన శ్రేయస్సూ కలుగదు' అని వారు అంటూ, ఒకానొకప్పుడు ఎలాటి దండమూ లేకనే ధర్మంతోనే ప్రజలు రక్షితులయిన దశ ఉండేదని భారతం నుంచి ఒక శ్లోకం ఉదాహరించారు.

'నరాజ్యం, నచరాజాచ,
నదండో, నచ దాండికః
ధర్మేణైవ ప్రజాస్సర్వే
రక్షంతి స్మ పరస్పరం.'

రాజ్యంలేదు—రాజనే వాడులేదు. దండం—శిక్ష—అనేది లేదు; దండించేవాడూ లేడు. ధర్మంతోనే ప్రజలు పరస్పరం రక్షించుకొనే వారట. వారు అన్నట్టు ఎన్నిచట్టాలు చేసినా ఏమి ప్రయోజనం ప్రజలలో ధర్మ ప్రజ్ఞ జాగృతం కానప్పుడు?

### ఆనాటి అనిశ్చిత స్థితి:—

1948 సెప్టెంబర్ 17 వ తేదీ పాత హైదరాబాద్ రాష్ట్రం భవితవ్యాన్ని నిర్ణయించిన రోజు. నిజాం నిరంకుశత్వాన్ని కూలదోయడానికి సంస్థాన ప్రజలు సాగించిన పోరాటం పరాకాష్ఠ ఫలితం. దాని సంస్మరణగా, మొన్న సెప్టెంబర్ 17 వ తేదీన గాంధీ భవన్‌లో జరిగిన మహాసభ శ్రోతలను పులకితులను చేసిన దంటే, ఆశ్చర్యం లేదు. ఆ చరిత్రాత్మకమైన పోరాటంలో పాల్గొన్న 52 మంది యోధవరులకు ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు 'మాన పత్రాలు' బహూకరించారు. ప్రస్తుతం వివిధ రంగాలలో, వివిధ రాజకీయ సిద్ధాంతాలతో ఉన్నా, ఆనాడు ఏకైక లక్ష్యంతో పోరాడిన వృద్ధ వీరులు రావి నారాయణరెడ్డి, డాక్టర్ మేల్కోటే, బి. ఎస్. మహాదేవ్ సింగ్, గోవిందదాస్ ష్రాఫ్, జొన్నం నరసింహాలు వంటివారు ఒకే వేదికపై సన్మానం పొందుతున్నప్పుడు చూచే భాగ్యం కలిగిన నాబోటి పత్రికా రచయితకూ, ఆనాటిమా 'మీజాన్' పత్రికచేసిన సేవ జ్ఞాపకం వచ్చి, ఆనందంతో కళ్ళు మూతలు పడ్డాయి. వారి త్యాగాల ఫలితాన్నే యువతరం అనుభవిస్తున్నారని, కనుక ఆ తరం తదను ప్రాణితమైన బుద్ధితో త్యాగాలకు సిద్ధంగా ఉండాలనడం, సంస్థాన స్వాతంత్ర్యోద్యమంలో ప్రప్రథమంగా ప్రాణాలర్పించిన షోయబుల్లాఖాన్‌ను స్మరించడం సభకు మంచి ముక్తాయింపు. శ్రీ దాశరథి ఆనాటి వాక్కు నేడూ వినిపించాడు.

### ఒడిస్సీ నృత్యోద్ధారకుడు

ప్రపంచంలో, ఏ ఉద్యమం పుట్టు పూర్వాలు చూచినా, మూలబంధ, మయి నట్టివారు మరుగునే ఉండిపోతున్నారు. అలాటివారిలో శ్రీ బచ్చుదయాల్‌శరణ్ ఒకరు. నామకరణ నామధేయం నరసింహాస్వామి అయినా, రాధాస్వామి వారి దయాల్ బాగ్‌లో చిన్ననాడు చదవడంవల్ల దయాల్ శరణ్ అయ్యారు. జన్మస్థలం బరంపూర్. ఉదయశంకర్‌వద్ద అల్మోడాలో నృత్యాభ్యాసం, రామ్‌గోపాల్ బృందంలో లంక, ఆఫ్రికా మొదలయిన దేశాలలో పర్యటనం, ఆయనకు వివిధ నృత్యాలలోను, సంగీతంలోను ప్రావీణ్యం చేకూర్చాయి. ప్రస్తుతం పిల్లల స్వప్నలోకమయిన జవహార్ బాలభవన్‌లో నృత్యశిక్షణ శాఖాధ్యక్షులు.

కేవలం దేవాలయాలలో దేవదాసీలకే పరిమితమైన ఒడిస్సీ నృత్యం గొప్పతనం గుర్తించారు తరం కిందటే. 1948 లో అన్నపూర్ణా థియేటర్స్ అనే సంస్థ నెలకొల్పి ఒడిస్సీని ఉద్ధరించి, నేడు దానిని జాతీయస్థాయికి తెచ్చిన శ్రేయస్సు ఈయనదే!

నేడు ధాత్మ్రవతి అవార్డులు పొందిన ఒడిస్సీ నృత్యకోవిదులు శ్రీ కేలూ చరణ్ మహాపాత్రో, మాయాధరరౌత్ మొద లయిన వారంతా ఈయన శిష్యులే. 'కళలో

అసాంకర్యం అనేది కష్టం. ఏకళ చెందాలన్నా ఆదానప్రదానాలు తప్పవు. మనం హిందూస్తానీలోని తరానాను తీసు కొని తిల్లానాగా చేసుకోలేదా? ఒక్క

ప్రగతి సాహిత్యంలోనే ఎన్నో పోరాటాలు (విభిన్న దాయాలు) ఉన్నాయి కదా! కనుక మా గురువుగారు ఉదయశంకర్‌లాగే వాడీ భరత సృజనాత్మక పద్ధతి, మానవుడు తాళ

---



---











## హైదరాబాద్ ...

లయాదులు ప్రకృతినుంచే నేర్చుకున్నాడు, దానినుంచే సృజనాత్మకతా నేర్చుకొంటూనే ఉండాలి' అంటారు ఈయన. ఔను! నృత్యపాండిత్యం నిండి, అనుభవం పండిన శ్రీ దయాల్ శరణ్ నుంచి, న్యాయదృష్టికి నిగ్గులుతీర్చిన బచ్చువారినుంచి అంతకన్నా భిన్నంగా ఎలా వినగలం ? బాల్ భవన్‌లోని 60 మంది నృత్య విద్యార్థులూ ఆయన సృజనాత్మక రీతులకు విశ్వదూతలు కాగలరనే నా నమ్మకం.

**సాయుధపోరాటం రజతోత్సవం!**

సెప్టెంబర్ 11 వ తేదీన ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణంలో మహా వైభవంగా రజతోత్సవం జరుపుకొన్న తెలంగాణా సాయుధపోరాటం తర్వాత తర్వాత ఏమి విమర్శకు గురి అయినా, మధ్య యుగాల రాజరికాన్ని కూలదోయడానికి సంస్థాన ప్రజలు చేసిన మహాప్రయత్న మనడాన్ని ఎవరూ కాదనరు. బుల్లెట్ వ్రణకిణాంకితుడు, మహావీరుడు శ్రీ రావి నారాయణరెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీ ఎన్. కె. కృష్ణన్ ప్రారంభోత్సవం జరిపిన ఈ ఉత్సవంలో శ్రీ బద్దం ఎల్లారెడ్డి, రాజ్ బహాదూర్‌గౌడ్ మొదలయిన వారు ప్రసంగించారు.

**ఉపశ్రుతి:—**

శ్రీ విశ్వేశతీర్థుల వారు ధర్మం కర్తవ్య పరాయణత గురించి ప్రసంగిస్తున్నప్పుడు ఒక మహాకర్తవ్య పరాయణుడైన సీనియర్ టికెట్ కలెక్టర్ మనస్సులో మెరిశాడు; దానితో ధర్మం కాలధర్మం చెందలేదనే నమ్మకం నాకు కలిగింది. ఆయన శ్రీ కె. శామ్యూల్. రెండునెలల క్రితం ఆయన ఏలాటి ప్రలోభానికీ లోనుకాక కర్తవ్యం నిర్వహించిన సంఘటన జ్ఞాపకం వచ్చింది. 'మిస్టర్ శామ్యూల్ నీవు గొప్పవాడివి. నీ దక్షిణ మధ్యరైల్వేకే కీర్తి తెచ్చావు.' అని అభినందించాను. 'నాడ్యూటీసార్; దానికోసమేకదా మాకు జీతం' అవి ఆయన అన్నమాటలు నాకు 'సెర్మన్ ఆన్‌ది మౌంట్' లాగ వినిపించి తన్మయత కలిగించాయి. ●

# సింథెల్

## వ్యానిషింగ్ క్రీమ్
## కలలుగనే,
## తళుక్కున మెరిసే
## ఆ సౌందర్యం కోసం

సౌందర్యాన్ని పెంపొందించటం కోసం. సింథెల్ వ్యానిషింగ్ క్రీమ్. ఉదయాన ముఖంపైన తళుక్కున మెరిసే మంచు బిందువులాంటి అనుభవం. ప్రతి రోజూ అలవాటుగా దీనిని వాడండి. దీనిలో మీ లావణ్యాన్ని ఇనుమడించే గుణం ఉంది. మీ 'మేకప్'ను చక్కగా రూపొందించి, మీ చర్మాన్ని ఎంతో తాజాగా ఉంచుతుంది. రోజంతా, ప్రతి రోజూ.




ఇది **గోద్రెజ్** వారి వస్తువు

ULKA GSVS-8 TEL

# అనామధేయుడి ఆత్మకథ

## సీరియస్నెల్ హాస్యరచన —— ఆర్వీయ

## 11

క్లబ్‌కి ఒక ప్రెసిడెంటనీ, ఒక సెక్రటరీ అనీ, ఒక ట్రెజరర్ అనీ వుంటే గాని శోభస్కరంగాదు. ఈ 'త్రిమూర్తులు' లేకపోతే అది ఒక 'సంఘం' అనిపించుకోదు. కార్యనిర్వాహకవర్గాన్ని ఎన్నుకోవలసిన వ్యవహారంలో పడ్డాం. బోలెడు గూడుపుఠాణీలు, కుతంత్రాలు, కుట్రలు, ప్రత్యక్ష పరోక్ష ప్రచారాలు, ఆక్షేపణలు, హేళనలు, నిందలు, నిట్టూర్పులు జరిగేక ఒకఒడ్డుకి చేరుకున్నాం. మొత్తానికి కార్యనిర్వాహక వర్గాన్ని ఎన్నుకున్నాం. మేము ఎన్నుకున్నాం అనడంకటె — వాళ్లే తమని ఎన్నుకోమన్నారు—అనడం సబబు!

ఎంచేతంటే...

ఈ మండలికి ప్రెసిడెంట్ మా ఆఫీసు మేనేజరు. వైస్‌ప్రెసిడెంట్ మా ఆఫీసు సూపర్వైజర్. సెక్రెటరీ... మా ఆఫీస్ హెడ్‌క్లార్క్, ట్రెజరర్ మా ఆఫీసు సీనియర్ ఎకౌంటెంట్...ఇది కార్యనిర్వాహకవర్గం! వీరికి సలహాలిస్తూ అవి మంచిగా పరిణమించినపుడు ఆ కీర్తి కార్యనిర్వాహకవర్గానికి చెందజేయడానికీ, అవి చెడ్డగా పరిణమించినపుడు ఆ అపకీర్తి తాము భరించడానికి వీలుగా ఒక 'సలహా సంఘం' ఏర్పడింది. అందులో నాకు సభ్యత్వం లభించింది.

ఈ సంస్థకోసం అహోరాత్రాలూ, ఇరవైనాలుగు గంటలూ పాటుపడిన నాకు ఇంత చిన్నపదవి మాత్రమే లభించినందుకు —'ఎంతకంతే - సంతుష్టి' అని నేను అనుకున్నా—కొందరు మరీ ఓర్వలేకపోయేరు. మండలి ప్రెసిడెంట్ గిరీ అయినా లేకుండా ఎలా బ్రతికి వున్నావయ్యా — అన్నారు. ఇంతకీ వాళ్లకేం తెలుసు ప్రపంచం సంగతి ? మాయామానుష లీలా విగ్రహాలతో నిండివున్న, ఈ జగన్నాటకంలో—

'పాటుపడు నొకండు; పదవి ఇంకొకడిది
విశ్వదాభిరామ! వినుర వేమ!'

అయినా, ఈ పదవి కూడా రాకపోతే ఏం చెయ్యగలం ? అదీగాక, 'అడుగులోనే హంసపాదు' అన్నట్టు ఈ పదవుల కోలాహలంలో ఆ సంస్థని మన చేతులతో మనమే నలిపేస్తే అది న్యాయమా ? అందరూ పదవులు రాలేదని బిర్రబిగిస్తే ఏ సంస్థ అయినా పురుట్లోనే సంధి కొడ్తుంది. ఇంకో సంగతి: మనం నిర్మించిన 'మండలి'ని మనమే నశింపజేయడానికి ప్రయత్నించడమా—అని కాస్త వెనక్కి తగ్గేను. లేకపోతేనా...??

కొంతమంది సభ్యులు వార్తాపత్రికా పఠనంతోనీ, మరి కొంతమంది చతుర్ముఖ పురాణ పారాయణతోనీ, ఇంకా మరి కొంత మంది భోజనపురాణ విషయిక లోకాభిరామాయణంతోనీ, తక్కుంగలవారు క్రీడా కౌతూహలాయత్త చిత్తంబులతోనీ కాలాన్ని నిక్షేపంగా క్షేపించసాగేరు, అంటే కాలక్షేపం చేయసాగేరు. వీళ్లంతా సగటుగాళ్ల (ఏవరేజ్ ఫెలోస్) మరి కొంతమంది కవి కుంజరులు, నటరాజులు, సాహిత్య దిగ్గజాలు, పేరుకోసం బాధ పడుతున్న వాళ్లు వున్నారు. వీళ్లు కళోద్ధారకులు. కళకోసం కనబడని కంకణం కట్టుకున్న వాళ్లు. కళకోసం—జీవితాన్నికాని, అథవా ఒకనెల జీతాన్ని అయినా ధారపొయ్యలేకపోయినా— కన్నీరు ధారపోసేవాళ్లన్నారు. వీళ్ల ఏడుపు ఏమిటంటే : 'నాటక కళ' అనే అంగం ఈ సంస్థలో అంతర్లీనమై వుందిగదా ! అంతర్లీనమై అధోగతిలోవున్న ఆ అంతర్భాగాన్ని బహిః ప్రదేశానికి లాక్కొచ్చి ఆ 'కళ'ని ఎందుకు ఉద్ధరించరూ ?'— అని! తత్ఫలితమే ఒక ఉపశాఖ 'నాటకీయ విభాగం'గా ఏర్పడింది. ఆ విభాగానికి నన్ను కార్యదర్శిగా ఎన్నుకున్నారు. 'ఏకక్రియాద్వ్యర్థకరీ' అన్నట్టు అయింది. సినీమాలలో చేరాలని మద్రాస్ వెళ్లడం, అక్కడ, నాపాట్లు మీకు తెలిసిన విషయమే ! సినిమాలలో చేరాలన్న భగీరథ ప్రయత్నం ఆ విధంగా వమ్ము అయిపోయిన నాకు ఆ 'కండూతి' కాస్త దీనిద్వారా తీర్చుకోడం ఒకటి ! పదవీవ్యామోహం ఈ కార్యదర్శి పదవిద్వారా కాస్త తీర్చుకోడం రెండు. ఇదీ నా ఉబలాటం.

* * *

మా మొట్టమొదటి నాటకం 'శ్రీకృష్ణ తులాభారం' అది ఇప్పటికీ నా గుండెలకి హత్తుకునిపోయి వుంది. అది తలుచుకుంటే ఇప్పటికీ నా ఒళ్లు జలదరిస్తుంది. అదొక వీధి నాటకం. శ్రీనాధుడు రాసిన వీధి నాటకం కాదులెండి. క్లబ్బుకి అప్పటికి తగిన వసతి లేకపోవడం చేత వీధిలో నాలుగు రోడ్ల మధ్య పందిరివేసి, అందులో వేసిన 'కళాకండూతి మండలి' వారి సమర్పణ— ప్రప్రథమ మహోజ్వల స్టేజినాటకం. అప్పటికి ఇంకా మాలో ఎవరు 'రంగ

మార్తాండు'లో, ఎవరు 'రంగసింహా'లో, ఎవరు 'రంగ గ్రామసింహా'లో ఎవరు 'రంగకుక్కుటా'లో, ఎవరు 'రంగకురంగా'లో తేలవి పరిస్థితులు.

నేను ఆ శ్రీ కృష్ణతులాభారంలో నారదుడిని. అందులోనూ— అప్టుడేట్— ట్వెంటీయత్ సెంచరీ నారదుడిని. బెంగాలీ లాల్చీ, మల్లెపువ్వులాంటి తెల్ల ఇజారు శాండల్‌వుడ్ స్లిపర్స్, చేతికి ప్లాటినమ్ రిస్టువాచీ, బాబ్‌డ్ హెయిర్‌స్టయిలూ, ఫేస్ పౌడర్ మలామాతో—నన్నుగాని చూస్తే ఆ నారదుడూ గిరదుడూ కూడా నాముందు పనికిరారు. నా వేషం అచ్చం నారదుడిలా లేకపోయినా, ఈ కాలంలో నారదుడు ఎలా వుండాలో తెలియజేసే అపూర్వ వేషం. 'కనుపకచ్చడాల్ కట్టుకొను ముని[ముచ్చు]'ని సిసలైన జెంటిల్మన్ మునిగా చూపించే వేష విశేషం. ఆ వేషాన్ని చూసి ప్రేక్షకులు దిగ్భ్రాంతులైనారంటే నమ్మండి. స్వర్గీయ కపిలవాయి రామనాథ శాస్త్రిగారి వేషానికి

## అనామధేయుండి ...

ఒక మెట్టు, మెట్టున్నర ఎక్కువేగాని తక్కువలేదు ... అతను తంబుర పట్టుకున్నట్టు గుర్తు, నేను మొయ్యలేనని కాబోలు నాచేత దాన్ని కూడా మో యి ం చ డ ం మాన్పిం చేశారు.

స్టేజి — రంగస్థలం అంటే చాలా మందికి తెలియక పోవచ్చు — దాని మీదకి ఎక్కేటప్పటికి ముచ్చెమటలు పోశాయి. భూమి గుండ్రంగా తిరిగిపోతూంది. ప్రేక్షక జనం అంతా ఒకే ఒక ముద్దలా కన బడ్డారు. శుద్ధ పౌర్ణమినాడు సముద్రపు కెరటాలు ఉవ్వెత్తుగా లేచి తటాలున విరిగి పడినట్లుగా ప్రేక్షక సముద్రం అల్ల కల్లోలంగా లేస్తూ పడుతూవున్నట్లు కన బడింది. ఒళ్లంతా కంపరం ముంచుకొచ్చింది. గుండెలు ఒకటే కొట్టుకోడం. ఆ కొట్టుకొనే వేగానికి తట్టుకోలేక గుండెలు సత్యాగ్రహం చేస్తాయేమోనని అనిపించింది.

నోరు లేవదు. 'నోటికి తాళం పడింది' అంటే ఏమిటో అనుకునేవాడిని. ఇప్పుడు స్పష్టంగా బోధపడింది. ఇదివరకూ ఎవరైనా 'వాడికి బుర్రలేదురా' అంటే అర్థం అయేదికాదు. ఇప్పుడు అర్థం అయింది. ఎందుకంటే కళ్లు చూస్తూనే వున్నాయి. కాని, ఎదురుగా వున్నది ఏదీ కనబడదు. అంతా శూన్యం. చెవులు వింటూనే వున్నాయి. కాని, ఏదో అనిర్వచనీయమైన కలగూరగంప గోల. బుర్ర ఆలోచిస్తూనే వుంది. కాని, ఏదో దారి తెన్నూ, లేని— ఆదీ అంతం లేని—అర్థం లేని—స్పష్టంగాలేని—చౌచౌ—కలగాపులగం ఆలోచనలు. దీనంతటిలోంచి తగుమాత్రం స్పష్టంగా కొంత లీలగా, కించిత్ రేఖా మాత్రంగా — ఆడియెన్స్ ఏదో గోల పెడుతున్నట్లు తోచింది.

ఔనండీ. స్కూల్లో నలుగురు పిల్లకాయల ఎదుట— నాలుగు గోడల మధ్య చిన్న నాటకం వెయ్యడానికీ — వడివీధిలో నాలుగురోడ్ల మధ్య నాలుగువేలలాగ కన బడుతూన్న, నాలుగు వందల మంది ప్రేక్షక మహాశయుల ఎట్టఎదుట వేయడానికీ సాపత్యమా? ఆ (నాలుగు వేలలా కన బడుతున్న) నాలుగు వందలమంది ప్రేక్షక మహాశయుల తాలూకు ఎనిమిది వందల కళ్లు నా ఒకే ఒక్కడిమీద ఆ పళంగా పడ్డాయా — నాకు 'దిష్టి' తగిలిందో యేమో ఒళ్లు నెప్పుబడింది. సమ్మోహన మంత్రముగ్ధుడివలె చైతన్య రహితంగా నిలబడిపోయేను అది నా తప్పా?

ఇంతలో కొంప లంటుకున్నట్టు పంచదార ధర ప్రాపంలా పెరిగిపోతున్నట్టు చంద్రమండలం నుంచి ధూమకేతువు వచ్చినట్టు, నేనేదో బ్రహ్మాండమైన అప రాధం చేస్తున్నట్టు—ప్రేక్షకలోకం ఒకటే ఘోష. ఆ ప్రేక్షక లోకమంతా ఏక గ్రీవంగా కలిసి కట్టుగా గొంతు చించుకొని ప్రేక్షక శోకం కిందకి మారింది.

ప్రేక్షక శోకంగా ఆగిపోతే, బాగానే వుండేది, కాని—

(ఇంకా వుంది)




విశ్వజ్యోతి పిక్చర్స్

# మాతృమూర్తి




దర్శకత్వం: మానాపురం అప్పారావు

ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: దాసరి నారాయణ రావు







శ్రీ

నిర్మాతలు వి.వి.రాజేంద్రకుమార్ బి.ఎ., కె.సత్యనారాయణ బి.ఎ.

# ప్రశ్నావళి

**...కె. రామలక్ష్మి...**

**జి. బి. వీస్, వైదేవి**

ప్రతి ఒక్కరూ కుటుంబనియంత్రణ పాటించాలని ప్రభుత్వంవారు ప్రచారం చేస్తూవుంటే యింకా మనవాళ్లు చెట్లకు పుట్టలకు మొక్కుతారెందుకు?

కుటుంబ నియంత్రణ—యిద్దరు లేక ముగ్గురు పిల్లలున్న వారికి. లేకుంటే అస్సలు పిల్లలు అక్కర లేదనుకున్నవారికి. అంతేగాని అసలు పిల్లలు లేనివారికి కాదు.

**పి. ఆర్. వీల్, కొమరగిరి పట్నం**

ఈ రోజుల్లో — వ్యవసాయం చేసుకోడానికి భూమివుండీ, వ్యాపారం చేసుకోడానికి స్తోమతు వున్న మగవాళ్లు కూడా ఉద్యోగాలకి ఎగబడుతారెందుకు?

సెక్యూరిటీ వుంటుందన్న నమ్మకం వారినలా ప్రాకులాడేలా చేస్తుంది. అంతేకాదు. వ్యాపారంలో దక్షత, వ్యవసాయంలో కృషి, అపరిమితంగా కావాలి. ఉద్యోగాల కలాంటివేం అక్కరలేదు. నెల తిరగ్గానే జీతం చేతులో పడుతుందన్న ధీమా వుంటుంది. కాని ఎప్పటికేనా— యీజీతపు రాళ్లకంటే— స్వంత వ్యవసాయం, స్వంత వ్యాపారం, హాయిగా వుంటాయి.

**జె. హెచ్. బి, మిట్టపాలెం**

కలము గొప్పదా? కత్తి గొప్పదా?

పట్టిన వాడి చేతిని పట్టి వుంటుంది—వాటి గొప్పతనం!

**సి హెచ్. సి హెచ్, కొండపేట**

మానవుడికి గాడిదని చూస్తే మనస్సులో నవ్వు వస్తుంది. మరి గాడిద మనస్సులో ఏమనుకుంటుంది?

...ఎలాగేనా నా వెనక్కాళ వైపు రాకపోతాడా తన్నక పోతానా అనుకుంటుంది.

లోకులు డబ్బు పుచ్చుకునేటప్పుడు— రెండుచేతులా అందుకుంటూరు. ఇచ్చేటప్పుడు ఒకచేత్తో యిస్తారు. ఎందుకు?

ఇవ్వడానికి— పుచ్చుకోందుకూ—అంత తేడా వుందవి. ఇష్టే వాడి దగ్గిర పుచ్చుకునే వాడెప్పుడూ తక్కువే.

**పి. ఎల్. ఏవ్మ్, వరంగల్**

ఈమధ్య పాఠకులప్రశ్నకు సమాధానం యిస్తూ సంస్కారం పుట్టుకతో అబ్బేగుణం అని రాశారు. అలా యివ్వడం ఆమె అజ్ఞానానికి శాస్త్రరహిత దృక్పథానికి నిదర్శనం.

మనం యిచ్చే బంగారాన్నిపట్టి నగ. మనం యిచ్చే మట్టిని పట్టి కుండ. మనం వేసిన నారుని పట్టి పంట— అంతే కదా! అంతేకాదు. అతి 'మంచి' అతి 'చెత్త' స్కూళ్లలో వేసినా విద్యావాతావరణాల వల్ల ఆయా విద్యార్థులలో మార్పు మూడు శాతానికి మించదనీ మిగిలినది పుట్టుక, పెరిగిన వాతావరణం వల్లనే ఏర్పడుతుందనీ, జెనెటికల్‌గా వుత్తమమైన తల్లి తండ్రులు, వెనుకతరాలు ఉంటే ఉత్తమ సంతానం కల్గే అవకాశాలు ఎక్కువ అనీ అటువంటి తల్లితండ్రుల పెంపకంవల్ల కూడా బాగుపడే అవకాశాలు ఎక్కువ అనీ ఈ మధ్య నల్గురు పాశ్చాత్య శాస్త్రజ్ఞులు ఒక పుస్తకం కూడా ప్రచురించారు. అంచేత జన్మతహ సంస్కారవంతునికి జీవితంలో అది పెంపొందే అవకాశం ఎక్కువ. కాని అతగాడు కుసంస్కారుల పెంపకంలో పడితే అది తక్కువ అని— మనం అనుకోడం అశాస్త్రీయమని నేను భావించను. ●

## లారీ ప్రమాదం

ఇసుక వేసుకుపోతున్న లారీ ఒకటి 17 వ తేదీ వుదయం కొత్తగూడెం ప్రాంతంలో తల క్రిందులైనందువల్ల ఆ లారీలో కూర్చున్న ఒకావె అక్కడికక్కడే చనిపోయిందట. ఇంకో ఆరుగురు పనివారు గాయపడ్డారట.

## భార్యని చంపి లొంగిపోయిన భర్త

చిత్తూరు జిల్లాకు చెందిన నలగామ్ పల్లి గ్రామంలో మునుస్వామి నాయుడు అనే ఆయన భార్య మీనాక్షమ్మకు ఆమె మేనమామతో సంబంధం వుందట. ఈ విషయాన్ని పసిగట్టిన మునుస్వామి నాయుడు భార్యతో చాలా సార్లు పోట్లాడి ప్రయోజనం లేక, యిక ఆమెను వో కత్తితో పొడిచి చంపి, పోలీసు స్టేషనుకు వెళ్ళి తను చేసిన పనిని వివరించి లొంగి పోయాడట.

* * *

# ఒక వారం విపరీతం

### ఫాలాక్షుడు

## ఆడపిల్లల స్కూల్లో ఉరిపోసుకున్న అబ్బాయి

కృష్ణగిరిలో కుట్టుపని నేర్చుకుంటున్న 19 ఏళ్ళ గోవిందన్ అనే కుర్రాడు కనవముట్లు గ్రామంలోని ఆడపిల్లల స్కూలులో వో గదిలో వురిపోసుకుని చనిపోయాడట. అతని చొక్కా జేబులో వున్న వో వుత్తరంలో 'నాకు జీవితం మీద విరక్తి పుట్టింది, అందుకనే పోతున్నాను. నాశవాన్ని పాతిపెట్టవద్దు తగలేసి, ఆభస్మాన్ని కావేరిలో కలపండి' అని వున్నదట.

* * *

బెంగళూరు బసవంగుడి శంకరమఠం రోడ్డులో నివసిస్తున్న 28 ఏళ్ళ బాలకృష్ణ అనే అతనికి,

# ఒకవారం విపరీతం

19 ఏళ్ళ అన్నపూర్ణ అనే ఆమెకూ వివాహమై నేడో ఏడాది అయిందట. బాలకృష్ణ పెట్టుకున్న కారు రిపేరు షాపు వ్యాపారంలో తీవ్రమైన నష్టం రావడం వల్ల భార్యా భర్తలిద్దరూ ఓ నిర్ణయానికి వచ్చి దాని ప్రకారం ఇంటితలుపులు లోపలకు వేసుకుని విషం త్రాగేశారట. ఆ వెంటనే వాంతులు చేసుకునే సరికి పక్కింటి వాళ్ళు లోపల గొడవ లేమిటని, తలుపులుతోసి లోపలికివెళ్ళి చూస్తే ఆ భార్యాభర్తలిద్దరూ మయకంలో పడున్నారట. వెంటనే విక్టోరియా ఆసుపత్రిలో చేర్పినా ఫలితం లేక చనిపోయారట.

## చిలుక జబ్బు!

లండన్‌లోని ఒక ఆసుపత్రిలో ఒకాయన విపరీతమైన కడుపునొప్పితో బాధపడుతూ చేరాడట.




డాక్టర్లు, ఎన్ని విధాల చికిత్సచేసినా ఆయన పరిస్థితి అంత కంత దిగజార నారంభించిందట. ఏమిటిదీ అనడిగితే ఆయన ఏదో వైనా భోజనం చేశారని అన్నారట. గుండె, వూపిరితిత్తులలో కూడా వ్యాధి వ్యాపించి, అవి తమ పనిని సరిగా చేయడం మానుకోబోయాయట. డాక్టర్లు ఇంకా ఆశ్చర్యపోయి, ఏమయ్యింటుం దసలూ అనడుగుతే లసలు విషయాం నాళ్ళావిడ బయట పెట్టిందట. పెంపుడు చిలుక మరణావస్థలో వుండగా ఆయన ఆ చిలుక నోటిలో నోరుపెట్టి శ్వాస అందించే యత్నం చేశాడట. ఆనా చిలుక చనిపోయిందట. ఈ విషయం విని డాక్టర్లు ఆ రోగికి 'చిలుక జబ్బు' చికిత్స చేసేసరికి కోలు కుంటున్నారట. సో .... డోన్ట్ కిస్ పేరట్!

## దైవోపహతుడు

నిడ్రవోలు ప్రభుత్వ ఆసుపత్రి సమీపంలో వెళుతున్న ఒక లారీకి వేళ్ళాడుతున్న తాడులో చిక్కుకుని షేక్ ఆదం అనే ఆయన చనిపోయారట. దారిన ఆయన నడిచిపోతుండగా పక్కగా పోతున్న ఆ లారీనుంచి వేళ్ళాడుతున్న తాడు ఆయనను పట్టి లాగి, చుట్టవేసేసిందట. ●

మీ
కుటుంబమునకు
కావలసినది
సర్వోత్తమమైనదే!




# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి... రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంత క్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ ప్రకటింపబడనట్లు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటే: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి.

ఎంత చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు యిష్టపడతారు!

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...ఎక్కువ మంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్‌కంటే కాల్గేట్‌నే కొంటారు!

పూర్తి దంత రక్షణకు
కాల్గేట్ టూత్ బ్రష్
వాడండి. 15 రకములలో
ప్రతివారికి అనువైనది
లభించును.




అనగనగా ఒకవూరు. ఆ వూరు రామాపురం కావచ్చును. రంగాపురం కావచ్చును. రామక్రిష్ణాపురం కావచ్చును. మీ వూరు కావచ్చును. మా వూరు కావచ్చును. ఆంధ్రదేశంలో ఏవూరయినా కావచ్చును.

ఆవూరి కంతకీ ఒకే ఒక రాజావారు (ప్రతి వూరిలోనూ రాజావారు ఒకరే వుంటారు. ప్రజలుమాత్రం చాలామంది వుంటారు) వారి పేరు పెదరాజా కావచ్చును. చినరాజా కావచ్చును. బులి రాజా కావచ్చును.

రాజావారికి మూడు టెక్స్టయిలు మిల్లులు, ఒక సినిమా థియేటర్లు వున్నాయి.

శ్రీవారికి ఆరు భవంతులు, ఎనిమిది బంగళాలు వున్నాయి.

రావణా బ్రహ్మవలె వారికి పది కుడి భుజాలు, పది ఎడమభుజాలు వున్నాయి. శ్రీవారికి శాసనసభలో సీటుంది. కాబినెట్‌లో చోటుంది. వారికి వెయ్యెకరాల మాగాణీ పొలం కూడా వుంది. ఆ పొలం దేవుని పేరుమీద వుంది.

(శ్రీవారి నిఘంటువులో
దేవాదాయం = ధర్మాదాయం)

రాజావారికి ఒకే ఒక పుత్రరత్నం వారి పేరు పెదబాబు కావచ్చును. చినబాబు కావచ్చును. బులిబాబు కావచ్చును. (ప్రస్తుతానికి, ఈ కథలో వారి పేరు కుమారరాజా)

# 4 లేబిళ్లకు మీకు




# ఉచితముగా
## ఒక జార్ రికరి

ఇప్పటినుండి మీ రికరి జార్ మీదనున్న లేబిళ్లను భద్ర పరచండి. కప్పు, సాసరు చినగకుండా. 4 లేబిళ్ల యిచ్చి మీకు దగ్గరగా నున్న డీలరునుండి ఉచితముగా ఒక 50 గ్రాముల జారును పొందండి.

మీ ప్రత్యేకమైన కాఫీ —రికరి ఇన్‌స్టెంట్.

చిక్కనైన విలువైన, సంతృప్తి కలుగ చేసే మీకు ఇష్టమైన కాఫీని సేవించండి.

ఈ అవకాశము ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, మరియు ఒరిస్సా రాష్ట్రములోని కొన్ని ప్రత్యేక పట్టణములలో మాత్రమే.

## కొత్తది! అధికస్ట్రాంగ్
# రికరి
## ఇన్‌స్టెంట్




# ప్రత్యేక రుచిలో ప్రత్యేక కాఫీ

## సోషలిజం కథ

కుమారరాజా వారికి చదువు లేదు. సంధ్య వార్చడం ఎలాగూ తెలీదు. పేకాట వారి హాబీ. రేసులాడటం వారి వృత్తి. తాగడం వారి వూపిరి. తాగి, బూతులు మాట్లాడటం వారి కలవాటు. బూతులు మాట్లాడకుండా తాగడం వారి పొరబాటు.

ఒకసారి కుమారరాజా వారికి అర్జెంటుగా, అరవై వేలు కావలసి వచ్చాయి. తళ— తళమని మెరిసే బ్యూక్ కారులో శ్రీమాన్ కుమారరాజావారే స్వయంగా పల్లెటూరు వేంచేసి, వారి భృత్యుల్నీ శిస్తు వసూళ్ల జీతగాళ్ళనీ గణితగాళ్ళనీ రైతుల పాలిటి కాలయముణ్ణి పిలిపించుకున్నారు. ఇది కథ కనుక కథలో పాత్రలకు ఒక పేరు వుండితీరాలి. యిది పాఠకుల శాసనం. పేర్లు లేకుండా, కథలు రాస్తే మన తెలుగు పాఠకులు చదువరు. అందుకని గుమాస్తాను 'చిత్తం చిత్తం చిట్టి పంతు'లని పిలుద్దాం.)

చిట్టిపంతులు కుమారరాజా వారి ముందు చేతులు కట్టుకుని నిలబడ్డారు.

'ఏం మహాప్రభో... తమరే స్వయంగా వేంచేసారు? కాకితో కబురంపితే, తమ సముఖమందు వచ్చి వాలనా?' అన్నాడు చిట్టి పంతులు వినయంగా. వినయంగా వుండటం నేర్చుకోనివాడు గుమాస్తా పనికి పనికిరాడు. ఆంధ్రదేశపు యువకుల్లారా, ఈ వాక్యాన్ని అండర్ — లైన్‌చేసి మరీ చదువుకోండి.

'డబ్బు కావాలి' అన్నారు కుమారరాజా

'ఎంత మహాప్రభో'

'అరవై వేలు'

'అరవై వేలే ... ప్రస్తుతానికి అంత సొమ్ము మనదగ్గిర లేదు ... అనక దఖలు చేసుకుంటాను. ఈ ఏడాది శిస్తు వసూలు కాలేదు.'

'ఎందుకని?'

'పంటలు పండలేదు'

'ఎందుకు పండలేదు?'

'వర్షాలు తెగకురిసాయి. గట్లు తెగి పోయాయి. పొలాలన్నీ మునిగిపోయాయి. పంటలన్నీ పాడయిపోయాయి.'

వర్షాలు తెగకురుస్తూన్న సమయంలో రాజావారు రేసుల నిమిత్తమై బెంగళూరులో వేంచేసి యున్నారు. అందుకని, వారికి విషయాలేవి తెలియవు.

'వర్షాలెందుకు కురిసాయి?!'

'మబ్బులు తెగముసిరాయి.'

'మబ్బులెందుకు ముసిరాయి'

'రాజావారు క్షమిస్తానంటే చెప్తాను.'

'సందేహమెందుకు? చెప్పు!' అని మందహాసం చేసారు కుమారరాజావారు.

'ఈ ఏడాది, దేశంలో రాజకీయ నాయకులు వేదికలెక్కి సోషలిజం గురించి ఒకటే వుపన్యాసాలిచ్చారు, ఈ వుపన్యాసా లన్నీ ఆవిరిగా మారి, ఆకాశంలో చేరి

మొబ్బులుగా ముసిరడంచేత అతిగా వానలు కురిసాయిట. ప్రజలంతా చెప్పుకుంటున్నారు. సోషలిజం సంగతి సోషలిస్టులెరుగు! ఈ వానల మూలంగా కరువొచ్చింది. కాటక మొచ్చింది. నోటు ధర పదిరూపాయల నుంచి పాతిక రూపాయలకు పెరిగింది.

మరొక ధర పదివేల నుంచి పాతిక వేలకు పెరిగింది.

పెద్ద పదవి వెల. లక్షరూపాయలనుంచి, అయిదు లక్షలరూపాయలకు పెరిగింది.'

కుమార రాజావారు తల వూయించారు. తల, వూయించారంటే, వారు ఆలోచిస్తున్నా రన్నమాట.

సోషలిజం వల్ల వానలు, వరదలు వస్తాయన్నమాట. ఈమాట ఎక్కడో విన్నట్లుందే! అనుకున్నారు కుమారరాజా వారు స్వగతంలో. గిరీశాలకేకాదు జమీందారులకీ వుంటాయి స్వగతాలు.

'చిట్టి పంతులూ! సోషలిజం అంటే ఏమిటి?' అని ప్రశ్నించారు. కుమారరాజా వారు,

'బక్కవాణ్ణి నాకేం తెలుసు మహాప్రభో శాశ్వత శాసనసభ సభ్యులు, ప్రముఖ గాంధీ వాదీ, ఇందిరమ్మ పటానికి పూలదండలు వేసి నిత్య పారాయణ చేసే మహాభక్తులు అయిన ఆ యొక్క పెద్దరాజా వారికే తెలియాలి సోషలిజం సంగతి 'వారినే అడిగి తెలుసుకోండి.' అన్నాడు చిట్టి పంతులు.

పెద్ద రాజావారిని దర్శించే నిమిత్తం, బ్లాక్ కారెక్కి శ్రీమాన్ కుమార రాజావారు తమ స్వస్థలం వేంచేసారు.

పెద్ద రాజావారు ఇందిరమ్మ దర్శనార్థం ఢిల్లీ వేంచేసి యున్నందున, కుమార రాజావారు, యథావిధిగా విందు భోజనంచేసి, మళ్ళీ కారెక్కి, బ్రాందీ సేవన నిమిత్తమై పట్నం కేసి వెళ్ళారు.

అయ్యా,

ఇదీ కథ.

పెద్ద రాజావారు, ఢిల్లీలో ఇందిరమ్మకేసి,

కుమారరాజావారు, పట్నంలో బ్రాందీ సీసాకేసి,

పరీక్షలు తప్పిన ఆంధ్ర యువకులు అభిమాన సంఘపు కార్యాలయాలకేసి,

పరీక్షలు పాసయిన నిరుద్యోగ యువకులు ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజి ఆఫీసుకేసి,

తెలుగు పాఠకులు వారపత్రికల సీరియల్ కథలకేసి,

ఈ కథ కంచికి!

ఈ వ్యస్తికి
ప్రస్తుతానికి
స్వస్తి—
(శ్రీ పురాణం శర్మకు అంకితం)

# తెలియక చేసిన తప్పు



ధర్మపథం — బులుసు వేంకటరమణయ్య

మానవుడు తన జీవితంలో పొరపడడం, తప్పులు చెయ్యడం అనివార్యమైనది. తాను చేసే పని యేదీ తప్పని భావించడం మానవప్రకృతి కాదు. అది యితరులకు తప్పుగా తోస్తుంది. తన తప్పును ఒప్పుకొనడం కూడా ఉంటుంది. 'ఇది చెయ్యడం తప్పు' అని తెలిసినప్పటికీ—తనకు తెలియకుండానే అది జరగడం కూడా సంభవమే! అలా తాను తెలియకుండా చేసిన తప్పుఫలం తాను అనుభవించక తప్పదు.

నృగుడు ఇక్ష్వాకువంశంలో పుట్టిన రాజు. ధర్మాత్ముడు. బ్రాహ్మణులకు గోవులను దానంచెయ్యడంలో పేరు పొందినవాడు. ప్రతిదినం ఆయన ఎన్నో గోవులను దానంచేస్తూ ఉండేవాడు. అతనిమందలో లక్షలకొద్దీ ధేనువులు ఉంటాయి.

ఒకప్పుడు కశ్యపుడనే ఒక బ్రాహ్మణునికి దానంయిచ్చిన ఆవు ఎలాగో తప్పించుకొని, తిరిగి అతని ఆవులమందలో కలిసిపోయింది. లక్షలకొద్దీ ఉన్న గోవుల్లో ఈ విషయం ఎవరు కనిపెట్టగలరు? అలవాటుపడిన పశుపాలకులకే అది తెలియదు. రాజుగారికి ఎలా తెలుస్తుంది? తెలియడానికి ఏం అవకాశమున్నది?

తర్వాత రాజు ఆ గోవునే మరొక బ్రాహ్మణునికి దానం యిచ్చాడు. ఆ గోవును అతడు తీసికొని పోతూ తన గోవును వెతుక్కుంటున్న కశ్యపునికి కనబడ్డాడు. కశ్యపుడు 'ఇది నా గోవు; దీన్ని దొంగిలించుకొని పోతున్నావా?' అని గద్దించి అడిగాడు. 'రాజుగారు దీన్ని నాకు దానం ఇచ్చారు' అన్నాడతడు. ఇద్దరూ జగడం వేసుకుని రాజు దగ్గరికి వచ్చారు. 'ఇది నీగోవని నాకు తెలియదు. మందలో కలిసిపోయి ఉంటుంది. అందువల్ల ఇతనికి దానమిచ్చాను. నీకు ఎన్నిగోవులనయినా ఇస్తాను ఇతనితో జగడమాడకు' అని రాజు కశ్యపునితో అన్నాడు. అదే కావాలన్నాడు కశ్యపుడు. అదే కావాలన్నాడు రెండో బ్రాహ్మణుడు. రాజు ఏం చెయ్యగలడు?

తన గోవును జాగ్రత్తగా చూచుకోక పోవడం కశ్యపుని తప్పు, అది మందలో కలిసిపోవడం గమనించక మళ్ళీ మందలో చేర్చడం పశుపాలకుల తప్పు, నిజంగా రాజుతప్పు లేదు. అయితేనేం? క్రింది పని వాళ్ళు తప్పు చేస్తే మాట వచ్చేది ఎవరికి? అధికారికే కదా! 'ఎందుకు గమనించలేదు?' అని ప్రభుత్వం అధికారినే అడుగుతుంది. అట్లే పశుపాలకులు చేసిన తప్పు రాజు తప్పుగానే భావించబడడంలో వింత లేదు.

ఈ రీతిని తాను తెలియక చేసిన తప్పువల్ల పాపం సంభవించి, ఆ పాపఫలంగా ఉత్తముడయినా నృగమహారాజు ఊసర వెల్లిగా జన్మించవలసి వచ్చింది.

తెలియక చేసినా, తెలిసి చేసినా తప్పో తప్పే. దానివల్ల కలిగే ఫలితాన్ని ఎట్టివాడయినా అనుభవించి తీరవలసిందే!




## 2

సాయంత్రం యేడుగంటలు అయింది.

బజార్లో ఒక్కొక్కకొట్టూ కట్టేస్తున్నారు. రామ్మూర్తి పనిచేస్తున్న కొట్టుకూడా కట్టివేయబోతున్నారు. అందరితోపాటు రామ్మూర్తి కూడా యింటికి వెళ్ళిపోవడానికి లేచాడు.

'ఈ కూడిక కొంచెం చూడండి' అని అంటూ కొట్టు యజమాని సత్యనారాయణ అంతట్లో ఒక కాగితాన్ని రామ్మూర్తి చేతికి యిచ్చాడు.

ఆ కూడిక సరిచూడడానికి రామ్మూర్తి మాత్రం కొట్లో మరి కొంచెంసేపు ఉండవలసి వచ్చింది. మిగిలినవాళ్ళందరూ వెళ్ళిపోయారు.

ఇప్పటి యజమాని సత్యనారాయణ తండ్రి కాలంనుంచీ రామ్మూర్తి ఆ కొట్లో పనిచేస్తున్నాడు. రామ్మూర్తి నిజాయితీ కలవాడు కావడంవలనా, అతను చాలాకాలంనుంచీ తమ కొట్లో పని చేస్తుండడంవలనా రామ్మూర్తి అంటే సత్యనారాయణకు చాలా అభిమానం.

సత్యనారాయణ స్వతహాగా మంచివాడు. మాటకు కట్టుబడేవాడు. తనదగ్గర పని చేస్తున్నవారియెడల సత్యనారాయణ చాలా ఉదారంగా ఉంటాడు. అందుచేత సత్యనారాయణ అంటే రామ్మూర్తికి గౌరవం.

'కూడిక సరిగ్గానే ఉందండి' అంటూ రామ్మూర్తి ఆ కాగితాన్ని తిరిగి సత్యనారాయణకు యిచ్చివేశాడు.

'ఇంతకూ మీరు అదృష్టవంతులు. మీ అబ్బాయి యిలాగ చదువు పూర్తిచేయగానే అలాగ ఉద్యోగం దొరికింది. మా దగ్గర పనిచేస్తున్న రామ్మూర్తిగారి అబ్బాయి మంచి ఉద్యోగంలో ఉన్నాడు. అంటే మా అందరకు కూడా చాలా సంతోషంగా ఉంది' అన్నాడు సత్యనారాయణ.

'అంతా మీ అభిమానం' అన్నాడు రామ్మూర్తి వినయంగా. సత్యనారాయణ ఆకస్మికంగా ప్రసాద్ విషయాన్ని ఎందుకు ప్రస్తావించాడో రామ్మూర్తికి తెలియలేదు.

'అయితే అబ్బాయికి యేమన్నా సంబంధాలు చూస్తున్నారా?'

'అబ్బాయి పెళ్ళికి తొందర యేముందండీ? ముందుగా అమ్మాయి లక్ష్మి పెళ్ళి చెయ్యాలి.'

'మీ అమ్మాయికి యేమండీ? ఒక్కని ముక్క. మీ అమ్మాయికోసం మీరు సంబంధాలు వెదక నక్కరలేదు. మీ సంబంధాన్ని వెదుక్కుంటూ పెళ్ళికొడుకే వస్తాడు.'

'మీరు అంటున్న వేళావిశేషం వలన అలాగే జరిగితే నా బాధ్యత చాలావరకు తీరిపోతుంది.'

'ఒక ముఖ్యమైన విషయం మీతో మాట్లాడదామనే, మిమ్మల్ని నేను యింత వరకు ఉంచేశాను.'

'ఏమిటో చెప్పండి' అన్నాడు రామ్మూర్తి కుతూహలంగా.

'మాకు ఉన్నది ఒక అమ్మాయి, ఒక అబ్బాయి. ఆ విషయం మీకూ తెలుసును. అబ్బాయి యింకా చిన్నవాడు కాబట్టి వాడి సమస్య మాకు ప్రస్తుతం యేమీ లేదు. ఈ సంవత్సరంతోనే చదువు మాన్పించేసి, మా అమ్మాయి విమలకు పెళ్ళి చేసేద్దామని నేను అనుకొన్నాను. కాని 'ఒక్క సంవత్సరమైనాసరే కాలేజీలో చదవాలి' అని మా అమ్మాయి పట్టుపట్టింది. 'అమ్మాయి అంత సరదా పడుతున్నప్పుడు మనం యెందుకు కాదు అనాలి ?' అని మా ఆవిడ కూడా అనడంవల్ల అమ్మాయిని కాలేజీలో చేర్పించాను. వచ్చే సంవత్సరం పరీక్షలు అయిపోగానే మా అమ్మాయి పెళ్ళి చేయవలసి ఉంది. ఆ పెళ్ళి విషయమై కొన్నాళ్ళపాటు నాకూ మా ఆవిడకు వివాదం జరిగింది.

'అలాగా!' అని రామ్మూర్తి అనగా సత్యనారాయణ మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

'మనకు పదిమంది పిల్లలు ఉన్నారు గనుకనా ? ఉన్నది ఒక పిల్లా, ఒక పిల్లవాడూను. అందుచేత అల్లుడిని యిల్లరికం తెచ్చుకోవాలని మా ఆవిడ కోరిక.

'ఎవరు పుట్టినా వారు స్వతంత్రంగా బతకాలి అని నా అభిప్రాయం. ఇల్లరికం రావడానికి సిద్ధపడే కుర్రవాడికి పిల్లను యివ్వడానికి నాకు యిష్టం లేదు. మనం ముందు విషయాన్ని కూడా ఆలోచించాలి. మా అమ్మాయి అల్లుడూ కాబట్టి

వాళ్లతో మేము యేదో ఒక విధంగా గడుపుకోగలము. కాని మా అబ్బాయి పెద్ద వాడు అయిన తరువాత వాళ్ళలో వాళ్ళకు సరిపడకపోవచ్చును. అప్పుడైనా అమ్మాయి, అల్లుడు వేరే పోవాలి కదా! అందుచేత యిల్లరికం తెచ్చుకోవడం మంచిది కాదు' అని నా నమ్మకం.

'ఏమైనా సరే, పిల్లను విడిచిపెట్టి ఉండలేను' అని మా ఆవిడ పట్టుబట్టింది.

'ఈ సంగతులు అన్నీ మేము చాలా రోజులు ఆలోచించిన తరువాత మాకు ఒక మధ్య మార్గం కనుపించింది' అన్నాడు సత్యనారాయణ.

'ఏమిటండీ ఆ మధ్యమార్గం?' అని ప్రశ్నించాడు రామ్మూర్తి.

'ఊళ్ళో సంబంధమే చేసినట్లయితే, అమ్మాయి మా యింట్లో కాకపోయినా, ఊళ్ళోనే ఉంటుంది. ఎప్పుడు చూడాలని బుద్ధిపుడితే అప్పుడు మా ఆవిడవెళ్ళి అమ్మాయిని చూడవచ్చును. అమ్మాయికి యిష్టమైనప్పుడు, మా యింటికి రావచ్చును. ఈ పద్ధతికి మా ఆవిడ కూడా అంగీకరించింది.'

'ఇది చాలా బాగుంది.'

'తరువాత ఈ ఊళ్ళోఉన్న సంబంధాలను గురించి నేను మా ఆవిడ ఆలోచించాము. అప్పుడు మీ అబ్బాయి ప్రసాద్‌కు మా అమ్మాయి విమలను యిచ్చి పెళ్ళి చేస్తే బాగా ఉంటుంది' అని మేము అనుకొన్నాము.'

'మా అబ్బాయికా?' అని రామ్మూర్తి ఆశ్చర్యపోయాడు.

'అవును. మీ అబ్బాయికే. మనిషికి గుణం ముఖ్యం కాని డబ్బు ముఖ్యంకాదు. డబ్బు యివాళ ఉంటుంది రేపు పోతుంది.'

'అవుననుకోండి. కాని' అని రామ్మూర్తి యేదో అనబోయి ఊరుకొన్నాడు.

'మా అమ్మాయి విమలను చిన్నప్పటి నుంచి మీకు తెలుసును. నేను మీకు నేడే యేమీ చెప్పవలసిన అవసరంలేదు.'

'అబ్బెబ్బే! విమలకు యేమండీ? బంగారు తల్లి.'

'ఇక కట్నాలు కానుకలు అంటారా? మా ఆవిడకు అమ్మాయి ఆరవప్రాణం. ఇవ్వడం విషయంలో మా ఆవిడ మీరు అనుకున్నదానికంటె యెక్కువగానే జరిపిస్తుంది కాని యే లోటూ రానివ్వదు.'

'అసలు ఆ విషయమై మేము ఎప్పుడూ ఆలోచించనే లేదు.'

'ఇక మీ అమ్మాయి లక్ష్మి విషయం కూడా మేమే ఆలోచించాము.'



# అనగనగా...

'ఏమిటండీ? ఏమిటి ఆలోచించారు?' అని మరింత ఆత్రుతగా ప్రశ్నించాడు రామ్మూర్తి.

'మా తోడల్లుడుగారి అబ్బాయి శ్రీనివాసరావు యిప్పుడు యం.యే. చదువుతున్నాడు. పిల్లవాడు చక్కగా ఉంటాడు బుద్ధిమంతుడు. వాళ్ళదీ మీ కొత్తపాలెమే. మీరు ఆ అబ్బాయిని యిక్కడ చూశారు కదా!'

'అవునండి! చాలాసార్లు చూశాను.'

'వాళ్ళ ఆస్తిపాస్తులకు లోటు యేమీ లేదు. ఇక్కడ చదువు అయిన తరువాత అతన్ని యింకా యే అమెరికాకో పంపి చదివిద్దామని వాళ్ళకు ఉద్దేశం ఉంది. ఆ అబ్బాయికి మీ లక్ష్మిని యిచ్చి వివాహం చేస్తే బాగుంటుంది అని మేము అనుకొన్నాను.'

'బాబూ ! లక్ష్మికి అంత పెద్ద సంబంధం చేయడానికి నా వద్ద శక్తి ఉండవద్దా?' అన్నాడు రామ్మూర్తి సంతోషంతో మాట్లాడలేకపోతూ.

'మీకు ఆ విషయంలో సందేహం యేమీ వద్దు; మా తోడల్లుడుగారికి నేను యెంత చెపితే అంతే. వాళ్ళు నా మాటకు యెప్పుడూ యెదురు చెప్పరు. కట్నాలు, కానుకలు మీరు యేమి యిచ్చినా సరే, మా తోడల్లుడుగారి అబ్బాయికి మీ లక్ష్మితో వివాహం జరిపించే బాధ్యత నాది.'

ఇదంతా కలో, నిజమో రామ్మూర్తికి తెలియడంలేదు. అతను యేమీ మాట్లాడలేకపోయాడు.

'మా తోడల్లుడుగారి అబ్బాయికి వచ్చే సంవత్సరం పరీక్షలు అయిపోయిన తరువాత పెళ్ళి చెయ్యాలని వాళ్ళ ఉద్దేశం. మా అమ్మాయికి కూడా అప్పుడే పెళ్ళి చెయ్యాలని మేము అనుకొంటున్నాము. మీకు యిష్టం అయినట్లయితే యీ రెండు పెళ్ళిళ్ళు ఒకేసారి జరిగించవచ్చును. 'ఈ రెండు నెలల్లో యేవో నోములు చేస్తాను' అని మా ఆవిడ అంటున్నది. దానికి మా తోడల్లుడుగారి కుటుంబం అంతా వస్తుంది. అప్పుడు యీ రెండు సంబంధాలకు ప్రధానం చేసుకొనవచ్చును. దీనికి మీరు యేమిటి అంటారు ?

'బాబూ ! ఇందులో నేను అనడానికి యేముంది ? మీరు చూపిస్తున్న యీ అభిమానానికి యెలాగ మీకు నా కృతజ్ఞత తెలియజెయ్యాలో నాకు బోధ పడడంలేదు. ఇది మరొకటి మరొకటీ కాదు. ఇది వివాహం. జీవితానికంతటికీ సంబంధించిన విషయం. అందుచేత ఒక్కసారి మా అబ్బాయికి చెప్పి' అని రామ్మూర్తి సగంలో ఊరుకున్నాడు.

'రామ్మూర్తిగారూ ! ఇప్పుడు మీరు అచ్చంగా వియ్యాలవారిలాగే మాట్లాడుతున్నారు' అని సత్యనారాయణ కొంచెం నవ్వాడు.

సత్యనారాయణ యెందుకు నవ్వుతున్నాడో రామ్మూర్తికి తెలియలేదు.

'బాబూ! నేను అన్నదానిలో పొరబాటు యేమైనా ఉన్నదా?' అని అతను సత్యనారాయణను ప్రశ్నించాడు.

'అబ్బెబ్బే, మీరు అన్నదానిలో పొరబాటు యేమీ లేదు. ఈ విషయం మీరు మీ అబ్బాయితో చెప్పాలి అని మీరు అనగానే నాకు నవ్వు వచ్చింది.'

సత్యనారాయణ నవ్వడానికి గల కారణం యేమిటో అప్పటికీ రామ్మూర్తికి అర్థం కాలేదు. అప్పుడు సత్యనారాయణే యిలాగ అన్నాడు.

'మీరు మీ పిల్లల్ని చిన్నప్పటినుంచీ యెంత ప్రేమగా పెంచారో నాకు తెలుసును. మీరు కష్టపడడానికైనా, మీరు సిద్ధపడ్డారు కాని మీ పిల్లలకుమాత్రం యే కష్టం కలగకుండా మీరు పెంచారు. మీరు కుంటుతూనే కొట్టువద్దకు వచ్చేవారు కాని మీ పిల్లలను మాత్రం రిక్షా మీద స్కూలుకు పంపేవారు. వాళ్ళకు యే మాత్రం సుస్తీ చేసినా, మీరు యెంతో బాధ పడేవారు. మీరు అంత ప్రేమగా పెంచిన పిల్లలు మీ మాటను కాదు అంటారా? అయినా 'యీ విషయం మీ అబ్బాయితో చెప్పవలసి ఉంది' అని మీరు అన్నారు. అందుకే నాకు నవ్వు వచ్చింది.'

'వాడితో యీ విషయం ముందుగా ఒక్కసారి చెప్పడం మంచిది' అని నేను అనుకున్నాను. అంతకుమించి మరియేమీ లేదు.'

'మీ అబ్బాయి మాట అలాగ ఉంచండి. ఈ సంబంధాలు చేయడం మీకు యిష్టం అవునా ? కాదా ?'

'బాబూ! యీ సంబంధాలు చెయ్యడం నాకు యిష్టమేనని వేరే నేను చెప్పాలా ? అయినా మీరు అడిగారు కాబట్టి నేను చెబుతున్నాను. ఈ సంబంధాలు చెయ్యడం నాకు పూర్తిగా యిష్టమే.'

'నాకు అది చాలు. ప్రధానాలు చెయ్యడానికైనా యింకా రెండు నెలల వ్యవధి ఉంది. ఈ లోపున మీరు మీ అబ్బాయితో చెప్పండి. ఇప్పటికే చాలా రాత్రి అయింది' అంటూ సత్యనారాయణ లేచాడు. రామ్మూర్తి అతన్ని అనుసరించాడు.

శాంత బియ్యం బాగుచేస్తూ కూర్చుంది, ఆమెకు కొంచెం దూరంలో కుర్చీలో కూర్చుని కాఫీ తాగుతున్నాడు రామ్మూర్తి.

'ప్రసాద్! ప్రసాద్!' అని పిలిచాడు రామ్మూర్తి కాఫీ తాగుతూనే.

'ఏమండీ ?' అంటూ తన గదిలో నుంచి తండ్రివద్దకు వచ్చాడు ప్రసాద్.

'అలాగ కూర్చో! నీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి.'

'తండ్రి తనతో చెప్పబోయే ముఖ్యమైన విషయం యేమిటి?' అని ఆలోచిస్తూ తండ్రికి యెదురుగా బల్లమీద ప్రసాద్ కూర్చున్నాడు.

'ముఖ్యమైన విషయం' అని తండ్రి అనగానే, అది యేమిటో తెల్సుకోవాలనే కుతూహలంతో లక్ష్మివచ్చి, తండ్రికి వెనుకగా నిలబడింది.

'మా కొట్టు యజమాని సత్యనారాయణగారి అమ్మాయిని నువ్వు యెప్పుడైనా చూశావా?' అని ప్రసాద్‌ను ప్రశ్నించాడు రామ్మూర్తి.

'కాలేజీకి వెళ్ళేటప్పుడు, యెప్పుడైనా కన్పిస్తుంది.'

'ఆ అమ్మాయి నీకు నచ్చిందా?'

'అమ్మాయి బాగానే ఉంటుంది కాని నాకు నచ్చడం యెందుకు?' అని తిరిగి ప్రశ్నించాడు ప్రసాద్.

'ఆ అమ్మాయిని నీకు యిచ్చి వివాహం చేస్తామని అంటున్నారు.'

'నాకా?' అని ఆశ్చర్యపోయాడు ప్రసాద్.

'అవును. నీకే. నిన్నరాత్రి సత్యనారాయణగారు నాతో చెప్పారు. ఆ అమ్మాయి తల్లియేమో ఆ అమ్మాయిని విడిచిపెట్టి ఉండలేనని అంటున్నదట. అందుచేత ఆ అమ్మాయికి ఊళ్ళో సంబంధమే చేద్దామని వాళ్ళు అనుకొన్నారట. వచ్చే సంవత్సరం పెళ్ళిచేస్తారు. ఆ అమ్మాయిని నీకు యిచ్చి పెళ్ళిచేస్తే బాగా ఉంటుందని



# అనగనగా...

వాళ్ళలోవాళ్ళు అనుకొన్నారట. ఇదీ విషయం' అన్నాడు రామ్మూర్తి.

ప్రసాద్ పెళ్ళి సంగతి తండ్రి ప్రస్తావించగానే, లక్ష్మి తండ్రికి కనబడకుండా ప్రసాద్‌కు మాత్రం కనిపించేలాగున అతన్ని వెక్కిరించడం ప్రారంభించింది. 'వదిన వస్తే, నీ చెవులు పట్టుకొని ఆడిస్తుంది' అనే అర్థం వచ్చేలాగున లక్ష్మి ప్రసాద్ వైపు చెయ్యి చూపించి, తరువాత తన చెవులు తనే పట్టుకొని అతన్ని వెక్కిరించింది.

లక్ష్మి చేస్తున్న వెక్కిరింపును చూడగానే, 'నిజంగా లక్ష్మి చెవులను మెలి వెయ్యాలి' అని ప్రసాద్‌కు అనిపించింది. కాని యెదురుగా తండ్రి ఉండడంవలన ఊరుకున్నాడు.

'నా పెళ్ళికి యిప్పుడు తొందరయేం వచ్చింది? ముందు లక్ష్మి పెళ్ళిచేసి వెయ్యండి. దాని పని చాలా పొగరుగా ఉంది' అన్నాడు ప్రసాద్.

'లక్ష్మి పెళ్ళి విషయం కూడా ఆయనే చెప్పారు.'

తన పెళ్ళి విషయాన్ని, తండ్రి ప్రస్తావించగానే లక్ష్మి లోపలకు పారిపోయింది.

'ఏమని చెప్పారు?' అని ప్రశ్నించాడు ప్రసాద్.

'వాళ్ళ తోడల్లుడుగారి అబ్బాయి యిప్పుడు యం.యే. చదువుతున్నాడట. పిల్లవాడు బాగా ఉంటాడు. మనం కట్నం యేమీ యివ్వకపోయినా సరే, ఆ అబ్బాయి లక్ష్మిని వివాహం చేసికొనేలాగున చేస్తాను' అని సత్యనారాయణగారు చెప్పారు' అన్నాడు రామ్మూర్తి.

'ఆ సంబంధం చాలా బాగుంది.'

'ఆ సంబంధం చాలా బాగానే ఉంది కాని నువ్వు వాళ్ళ అమ్మాయి విమలను పెళ్ళిచేసుకొంటేనే సత్యనారాయణగారు లక్ష్మికి ఆ సంబంధం కుదిరేలాగ చేస్తారు. అందుచేత విమలను పెళ్ళిచేసుకోవడం నీకు యిష్టం అవునా? కాదా? ముందు అది తేల్చి చెప్పు' అన్నది శాంత మధ్యలో జోక్యం చేసుకొని.

'నా పెళ్ళికి యిప్పుడు తొందరయేం ఉన్నది? సావకాశంగా ఆలోచించుకొనవచ్చును' అంటూ ప్రసాద్ లేచి నిలబడ్డాడు.

'వెళ్ళిపోవడం కాదు కూర్చో' అని రామ్మూర్తి అనగా, ప్రసాద్ అయిష్టంగానే కూర్చున్నాడు.

'చూడు బాబూ! నీ పెళ్ళి విషయంలో నీకు తొందర లేకపోవచ్చును కాని మాకు తొందర ఉంది. మాకు యిది చాలా ముఖ్యమైన విషయం కూడాను. మన కుటుంబ పరిస్థితి నీకు తెలియనిది కాదు. నా సంపాదనతో యిల్లు గడవడమే కష్టంగా ఉంది. ఇప్పుడు లక్ష్మి పెళ్ళి చేయవలసి ఉంది. లక్ష్మి పెళ్ళి చేయడానికి మనవద్ద ఒక్క రూపాయి కూడా నిలవ లేదు. ఈ రోజుల్లో ఆడపిల్ల పెళ్ళి చెయ్యడం అంటే మనలాంటివాళ్ళకు సామాన్యమైన విషయం కాదు.

'నీ అదృష్టంవల్లనో, లక్ష్మి అదృష్టం వల్లనో లేకపోతే మా అదృష్టంవల్లనో, సత్యనారాయణగారికి యిటువంటి మంచి ఆలోచన వచ్చింది. వాళ్ళ అమ్మాయి విమల కూడా చక్కగా ఉంటుంది. చదువుకుంది. వాళ్ళ అమ్మాయిని నువ్వు వివాహం చేసికొన్నట్లయితే, సత్యనారాయణగారు నీకు భవిష్యత్తులో కూడా సహాయంగా ఉంటారు. లక్ష్మి కూడా మంచి యింట్లో పడుతుంది. తల్లి తండ్రులమైన మాకు మీ విషయంలో యింతకంటె సంతోషకరమైనది యేదీ లేదు.

'మీ యిద్దరి పెళ్ళిళ్ళు అయిపోతే, యిక రాజు మాత్రం ఉంటాడు. వాడికి కూడా రెండు సంవత్సరాల్లో యేదో ఒక ఉద్యోగం చూసి తరువాత పెళ్ళి చేసివేస్తే, మా బాధ్యత పూర్తిగా తీరిపోతుంది. తరువాత మీ అమ్మ, నేనూ కొత్తపాలెం వెళ్ళిపోదామని అనుకొంటున్నాము. అక్కడ ఒక చిన్న మడిలో కూరగాయలు పండించుకొంటే మా రెండు పొట్టలు గడచిపోతాయి. చాలాకాలం మేము కష్టపడినా, 'ఆఖరుకు' అయినా సరే 'రామా, కృష్ణా' అనుకొంటూ ప్రశాంతంగా జీవిద్దా'మని అనుకొంటున్నాము.

'వస్తు వాహనాలు లేవు అనే చింత మాకు యెప్పుడూ లేదు. కొంచెం ఆలస్యంగా అయినా, భగవంతుని దయవలన

మీరు పుట్టారు. కష్టపడి మిమ్మల్ని పెంచాము. మీరు పెద్దవాళ్ళు అయ్యారు. మీరు సుఖంగా జీవించాలి. 'ఫలానావాళ్ళ పిల్లలు బుద్ధిమంతులు' అని నలుగురూ చెప్పుకొనేలాగున ఉండాలి, అనే కోరిక తప్ప, మాకు రెండవ కోరిక యేదీ లేదు.

'నువ్వు చదువుకున్నవాడవు. ప్రపంచంలోగల అన్ని సంగతులు చూస్తున్నావు. అందుచేత యింతకంటే వివరంగా నీకు చెప్పవలసిన అవసరం లేదు. మన కుటుంబం తాలూకు భవిష్యత్తు అంతా నీ నిర్ణయంమీద ఆధారపడి ఉంది. అన్ని విషయాలూ ఆలోచించు' అని యెంతో ప్రతిమాలుతున్నట్లుగా చెప్పాడు రామ్మూర్తి.

తండ్రి యింతగా చెప్పినప్పటికీ ప్రసాద్ 'సరే, ఆలోచిద్దాం' అని అంటూ తన గది లోనికి వెళ్ళిపోయాడు.

'ఇంతకూ ప్రసాద్ మీకు చెప్పిన సమాధానం యేమిటి ?' అన్నట్లుగా శాంత రామ్మూర్తి వైపు చూసింది.

రామ్మూర్తి కూడా శాంత ముఖంలోనికి దీనంగా చూడడం తప్ప యింకేమీ చేయలేకపోయాడు.

*   *   *

ఆ వేళ ప్రసాద్ మామూలుగా ఆఫీసుకు బయల్దేరాడు. తండ్రి చెప్పిన మాటలు అతని చెవిలో యింకా ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి,

'తండ్రి చెప్పిన మాటల్లో అబద్ధం యేమీ లేదు. విమల బాగానే ఉంటుంది. తాను విమలను వివాహం చేసికొన్నట్లయితే, లక్ష్మి వివాహం కూడా సులువుగా జరిగిపోతుంది. తల్లిదండ్రులు సంతోషిస్తారు. కాని తాను విమలను వివాహం చేసుకొంటే, మరి కాంచన సంగతి యేమిటి ?

'అయినా తనకూ కాంచనకూ ఉన్న సంబంధం యేపాటిది ? తాను ఒక ఆఫీసులో అసిస్టెంటు మేనేజరు. ఆమె ఆ ఆఫీసులో స్టెనోగ్రాఫరు. ఇద్దరకూ అసలు పరిచయం కలిగి పట్టుమని పది రోజులు కూడా కాలేదు కదా !

'పోనీ, తను కాంచనను ప్రేమించాననే అనుకొందాం. కాని కాంచన కూడా తనను ప్రేమిస్తున్నదా ? ఏమో, అంతా అయోమయంగా ఉంది' అని అనుకొంటూ ప్రసాద్ ఆఫీసులో ప్రవేశించాడు.

'గుడ్ మార్నింగ్ మిస్టర్ ప్రసాద్!' అంటూ కాంచన ప్రసాద్ ఆఫీసుకు రాగానే పలకరించింది.

'గుడ్ మార్నింగ్' అంటూ ప్రసాద్ తన గదిలోనికి వెళ్ళిపోయాడు.

'ఈ కాంచనను కాకుండా తాను మరొకర్ని వివాహం చేసికొనడమా ? అది ఊహించడానికి కూడా వీలుకాకుండా ఉన్నది. తాను విమలను వివాహం చేసికొనకపోయినట్లయితే, లక్ష్మి వివాహం కూడా ఆగిపోతుంది. తమ మాట వినలేదని తల్లిదండ్రులు బాధ పడతారు.

ఇంకొకరు బాధ పడకుండా ఉండే నిమిత్తం వారు చెబుతున్న అమ్మాయిని తాను వివాహం చేసికొనాలా? అది అసంభవం. ఇంకొకరిని సంతోషపెట్టడం తనకు ముఖ్యం కాదు. తన సంతోషమే తనకు ముఖ్యం. తన వివాహం పూర్తిగా తన వ్యక్తిగతమైన విషయం' అని ప్రసాద్ తనలో అనుకొంటుండగా

'మీరు ఈవేళ యేదో పరధ్యానంగా ఉన్నట్లున్నారు' అంటూ కాంచన ప్రసాద్ గదిలోనికి వచ్చింది.

'అబ్బే, యేం లేదు' అన్నాడు ప్రసాద్ కంగారుగా.

*   *   *

రాత్రి తొమ్మిదిగంటలు అయింది.

'ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది, పిల్లలు యెక్కడకు వెళ్ళారు ?' అని శాంతను ప్రశ్నించాడు రామ్మూర్తి యింటికి రాగానే.

'లక్ష్మి నిద్రపోయింది. రాజా చదుకోవడానికి వెళ్ళాడు. ప్రసాద్ సినిమాకు వెళ్ళాడు' అని అంటూనే శాంత గది లోనికి వెళ్ళి ఒక కవరు తీసికొనివచ్చింది.

'ఇదిగోనండి డబ్బు. ప్రసాద్ యిచ్చాడు' అని ఆమె ఆ కవరు రామ్మూర్తికి యివ్వబోయింది.

'ఏం డబ్బు ?' అని ప్రశ్నించాడు రామ్మూర్తి కవరు తీసికోకుండానే.

'ఈవేళ ఫస్టు తారీఖు కదండీ!' జీతం యిచ్చారు' అని యిచ్చాడు.

'ఎంత ?'

'మూటయ్యాభై.'

'మూటయ్యాభయ్యా?' అని ప్రశ్నించాడు రామ్మూర్తి ఆశ్చర్యపోతూ.

'అవును. మూటయ్యాభయ్యే యిచ్చాడు. మొత్తం ప్రసాద్ జీతం యెంత వస్తుందండీ ?

'నాలుగు వందలపైన వస్తుంది. ఎపాయింటుమెంటు ఆర్డరులో చూశాను' అన్నాడు రామ్మూర్తి.

'అయితే రెండువందల యాభైరూపాయలు తాను తీసికొని మనకు మూటయ్యాభై రూపాయలు యిచ్చాడన్నమాట.'

దానికి రామ్మూర్తి యేమీ మాట్లాడ లేదు.

'మిగిలిన డబ్బు యేం చేశావు ?' అని నన్ను అడగమంటారా ?'

'వద్దు. అడగొద్దు. ఉద్యోగంలో చేరిన



మొదటి నెల కదా! బట్టలు కుట్టించుకోవడం నిమిత్తం తీసికొని ఉండవచ్చును. వచ్చే నెలలో వాడే పూర్తిగా యిస్తాడు.'

'సరే మీ యిష్టం' అన్నది శాంత.

'మీతో ఒక మాట చెబుదామనుకొంటున్నానండీ' అని తిరిగి అన్నది శాంత కొంచెం సేపు ఆగి.

'ఏమిటి ?'

'నా వస్తువులు యెలాగా పోయాయి. నాకు యిప్పుడు వస్తువులు ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే. వస్తువులు లేవు అనే చింత కూడా నాకు లేదు.'

'ఊఁ.'

## అనగనగా...

'అమ్మాయి మెడ బొత్తిగా బోసిగా ఉందండి!'

'అవును.

'ప్రసాద్ పరీక్షకు డబ్బు కట్టవలసి వచ్చినప్పుడు, లక్ష్మి తాలూకు గొలుసు ఉంగరం తాకట్టు పెట్టాం. ఈ డబ్బుతో ఆ వస్తువులు విడిపించండి.'

'అలాగే' అన్నాడు రామ్మూర్తి పరధ్యానంగా.

ఆ రాత్రి రామ్మూర్తికి చాలాసేపు వరకు నిద్ర పట్టలేదు. ప్రసాద్ ప్రవర్తన గురించే అతను ఆలోచించడం ప్రారంభించాడు.

'ప్రసాద్‌కు నాలుగువందల రూపాయలకు పైగా జీతం వస్తుంది. అయినా వాళ్ళ అమ్మచేతికి నూటయాభై రూపాయలు మాత్రం యిచ్చాడు. మిగిలిన డబ్బు యేం చేశాడు ? తాను అన్నట్లుగా బట్టలు కుట్టించుకొన్నాడా ? అలాగ అయితే ఆ మాట వాళ్ళ అమ్మతో చెప్పవచ్చును కదా! 'బట్టలు కుట్టించుకుంటాను' అని చెప్పి మొత్తం నాలుగువందల రూపాయలు ప్రసాద్ తీసికున్నా తాను యిప్పుడు యింతగా ఆలోచించవలసిన అవసరం ఉండేది కాదు

ఈ ఒక్క విషయంలోనే కాదు. సత్యనారాయణగారి అమ్మాయి విమలను వివాహం చేసికొమ్మని తాను చెప్పినప్పుడు కూడా ప్రసాద్ నిర్లక్ష్యంగానే ప్రవర్తించాడు.

విమలను వివాహం చేసికొమ్మని తాను చెప్పగానే, 'సరే మీ యిష్టం నాన్నగారూ!' అని ప్రసాద్ అంటాడని తాను ఆశించాడు. ప్రసాద్ నిజంగా అలాగ అన్నట్లయితే తాను యెంత సంతోషించేవాడు? ఎన్నో రోజులుగా యెడారిలో దాహంతో బాధపడుతున్నవానిమీద ఆకస్మికంగా అమృతవర్షం కురిసినట్లు ఉండేది!

వాళ్ళ శ్రేయస్సు తప్ప తనకు మరో కోరిక యేమిటి ఉన్నది ? వాళ్ళ మంచిని కోరి తాను అంతగా చెప్పినప్పటికీ, ప్రసాద్ నిర్లక్ష్యంగా ప్రవర్తించడానికి కారణం యేమిటి? కారణం యేమిటి?

అసలు ఈ విషయాన్ని తాను ఇంతగా ఆలోచించడం యెందుకు? తన మాటను కాదు అని ప్రసాద్ అనలేదు కదా!

'అయితే ప్రసాద్ నిర్లక్ష్యానికి కారణం యేమిటి ?'

'ఆ అమ్మాయిని వివాహం చేసుకోవడానికి తనకు యిష్టమే' అని చెప్పడానికి ప్రసాద్ సిగ్గుపడి ఉండవచ్చును. దీనికంతటికీ వాడి వినమ్రతనం తప్ప మరొక కారణం యేమీ లేదు' అని రామ్మూర్తి అనుకొంటూనే క్రమంగా నిద్రాదేవి ఒడిలోనికి ఒరిగిపోయాడు.

(ఇంకా ఉంది)

## నేను మానవుణ్ణి!

మందార వనంలో విహరించిన వాణ్ని!
జీవితాన్నే వరించిన వాణ్ని!
పూల సౌరభాల ఒడిలో— వేలరాతే వెన్నెల తడిలో
కనురెప్పలు కైపులో కదిలించినవాణ్ని!
నిర్మల సరోవర జలాన్ని రాతిబెడ్డలతో చెరిదించిన వాణ్ని!
నేను మానవుణ్ని!
అవసరాల చిక్కుముడులు మనసు నిండా వేసుకున్నవాణ్ని!
ఆవేదనాగాలానికి గుండెను తగిలించిన వాణ్ని!
కాలానికి వెరచిన వాణ్ని,
నా కోసమే నడుస్తున్న వాణ్ని!
నేను మానవుణ్ని!,
'కోర్కెల తేనెపట్టు వెక్కిలి' వినాటి
ఈగలు నా చుట్టూ మూగాలని కలలుకన్న వాణ్ని!
కంటిలో కదిలే అందాలు కాంచిన వాణ్ని!.....
ఇప్పుడు—
నేను కదిలించిన ఈగల కోరల బాధలతో తరుమబడుతున్న వాణ్ని,
మధువులే విషమని తమతున్న వాణ్ని!
ఈ సందడిలో, గొడవలో
ఎక్కడో నా జేబునిండి జారిపోయిన 'వివేకాన్ని'
ఈ సందడి హతమయ్యాక
ఎప్పుడో వెతుక్కోవాలనుకుంటున్న వాణ్ని!.....
పోని— వివేకం పోతేపోని—
నేను మానవుణ్ని — కనుక
'మానవతని' దాచిన నా జేబులనిండా చెయ్యివేసి
పట్టుకుని సరిగిడుతున్న వాణ్ని!
పడుతూ లేస్తున్నవాణ్ని!
నేను మానవుణ్ని!
కాను
నేనూ మానవుణ్ని!!

—ఆకొండి వెంకటరత్నం.

# కె. ఆర్. విజయయొక్క—
# నాలుగు చక్కని రహస్యములు:




మన దేశమునకు విజయము చేసిన ఒక విలాస ప్రయాణపు ఓడమీద జరిగిన పార్టీలో
కె. ఆర్. విజయ వ్యక్తిగతమైన కొన్ని నిజములను తెలుపుటకు అంగీకరించేరు :
భారతదేశముకాక, ప్రపంచములో వేరే ఏ చోట నివసించడానికి మీరు యిష్టపడతారు?
'నిజంగా నాకు తెలియదనే చెప్పాలండీ. స్విట్జర్లెండ్ బాగుంటుందేమో ?
నేను నిజంగా ఆలోచించనే లేదు. దక్షిణ భారతదేశం ఎంతో బాగుంటుంది.'
మీ పుట్టిన రోజుకు ఏ బహుమానము అంటే యిష్టపడతారు ?
'దక్షిణాది పట్టు చీర చాలు. దాని తళతళ చూస్తే నాకు ముచ్చటవేస్తుంది:
మీకు యిష్టమైన ఆభరణములు?
'వజ్రములు పొదిగిన జయపూర్ మీనా నగిషీ వస్తువులు'
విజయా, మీ అందపు రహస్యము ఏమిటి ?
'లక్స్. ప్రపంచమంతటికీ తెలిసినదే.'

**'నా వర్చస్సు మృదువుగా ఉండడానికి**
**కారణము నేను లక్స్ వాడడమే—**
**అది శుద్ధమైనది మరియు ఎంతో**
**సౌమ్యమైనది కూడాను.'**

KRVijaya



# సినిమా

## దొంగ పాత్రలో కృష్ణ

మహేశ్వరీ మూవీస్ నిర్మిస్తున్న 'మా యింటి వెలుగు' లో కృష్ణ ద్విపాత్రాభినయం చేస్తున్నారు. దొంగ పాత్రను అద్భుతంగా పోషించినట్టు రషస్ చూసిన వాళ్ళు చెపుతున్నారు. ఈ చిత్రంలో చంద్రకళ, వెన్నిర ఆడై నిర్మల యిద్దరు కృష్ణకి జంటగా నటిస్తున్నారు. ఒక ముఖ్య పాత్రను అంజలీదేవి పోషిస్తుంది. సత్యనారాయణ, త్యాగరాజు, బాలకృష్ణ సహాయ భూమికలను ధరిస్తున్నారు. ఈ చిత్రానికి పినిశెట్టి రచన్ను, సత్యం సంగీతాన్ని, ప్రకాశ్ ఛాయను నిర్వహిస్తున్నారు. విజయ్ దర్శకుడు. పూర్ణా విడుదల. నిర్మాత: పైడిమర్రి.

## గుడ్డివాని పాత్రలో బాలయ్య

అమృతాఫిలింస్ నిర్మించనున్న 'నేరము—శిక్ష' చిత్రంలో కృష్ణ నాయకుడు. బాలయ్య గుడ్డివాని పాత్రను, సత్యనారాయణ మాడరన్ గిరీశం పాత్రను పోషిస్తారు. కె. విశ్వనాథ్ దర్శకుడు.

## భర్త దైవత్వం భార్య నీరాజనం

'మీలో కనిపించే దైవత్వానికి నిత్యం నీరాజన మిచ్చే పూజారిణిగా నేనుంటే చాలు' అంటుంది, బడిపంతులు రాఘవరావు భార్య జానకమ్మ.

'లాలించే వెన్నెలలాంటి నీ మనసుండగా కర్పూర నీరాజనాలతో నాకు పని ఏమిటి?' అంటాడు బడిపంతులు రాఘవరావు.

అంతవయసు వచ్చేవరకు, ఆ దంపతులు అన్యోన్యత చెక్కుచెదర లేదు. పరిపూర్ణ మానవుడిగా, కర్తవ్యాన్ని నిర్వహించే ఆ పవిత్ర మనస్సుకి, నిండు గృహిణిగా చేదోడు, వాదోడై మెలగటమే ఆ అమృత హృదయుని ఆశ, ఆశయం.

జీవిత సర్వస్వం నివాళిచేసే ధర్మపత్ని జానకిగా అంజలీదేవి, జీవితమంతా ఆమె ప్రేమకు అంకితమై పోయిన ప్రసన్న హృదయుడిగా నందమూరి తారక రామారావు జీవించిన చిత్రం త్రివేణివారి 'బడిపంతులు'.

ఇంతకు ముందు వీరిద్దరూ కలిసి ఎన్నో చిత్రాల్లో నటించి యున్నారు. కానీ భిన్నత్వంలో ఏకత్వం సాధించిన భార్యా, భర్తలుగా ఈ చిత్రంలో అజరామరులై పోతారు. పి. పేర్రాజు నిర్మించిన యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. పూర్ణ విడుదల.

## భానుమతి చిత్రంలో కొత్త గాయని

సంచలన నాయకి, మేటి గాయకి, బహుముఖ ప్రజ్ఞాధురీణ అయిన భానుమతి భరణి పిక్చర్స్ నిర్మించే 20 వ చిత్రంలో ఒక కొత్త గాయనిని పరిచయం చేస్తున్నారు. ఆమె పేరు కోవెల శాంత. ఆమె పాడిన పాటను సెప్టెంబర్ 1 న రికార్డింగ్ జరిపారు. వీటూరి వ్రాసిన—

'చిలకమ్మపాట— కాకమ్మనోట
వింటావా— గోరింకా
విని చూస్తావా— నా వంకా'

అనేడి పాటను పద్మనాభం, రమాప్రభలపై చిత్రీకరిస్తారు.

కథలో కొత్తదనం, టేకింగ్‌లో వేగం, వున్న యీ చిత్రంలో భానుమతి తన అసమాన నటనా చాతుర్యంతో ఆంధ్ర ప్రేక్షకుల్ని మరొకసారి ఆకట్టుకొనడం తథ్యం. ఈ చిత్రంలో గుమ్మడి, రాజనాల, చంద్రమోహన్, ప్రమీల ముఖ్యతారాగణం.

ఈ చిత్రానికి కథ, సినిమా అనుకరణ, సంగీత దర్శకత్వం చేపట్టడమే గాక నాయిక పాత్రను కూడా భానుమతి నిర్వహించడం, ఆమె ఒక్కర్తెకే సాధ్యమయ్యే పని అనడం వుచితం. ప్రజల్లో ఆమెకు ఎంత పలుకుబడి వుందో 'అంతా మనమంచికే' చిత్రం నిరూపించింది. ఆమె దర్శకత్వంలో నిర్మితమయ్యే యీ చిత్రం బహుళ ప్రజాదరణ సొందడం ఖాయం.

## విశ్వభారతిలో లక్ష్మి

'శ్రీమంతుడు' చిత్ర నిర్మాత రాధాకృష్ణమూర్తి నిర్మిస్తున్న ద్వితీయ చిత్రం షూటింగు సెప్టెంబర్ 1 న సారథిలో ప్రారంభమైంది. వి. మధుసూదనరావు దర్శకత్వం నిర్వహిస్తున్న యీ చిత్రంలో లక్ష్మి నాయికగా నటిస్తుంది. కథానాయకుడు నాగేశ్వరరావు సెప్టెంబర్ 5 న మొదటి షెడ్యూలులో పాల్గొన్నారు.

## జాతీయ మవుతుందా?

'చిత్ర పరిశ్రమను జాతీయంచేసే ఉద్దేశ్యం ప్రభుత్వానికి యేమాత్రం లేదు' అని కేంద్ర మంత్రి గుజరాల్ చెప్పారు. లక్నోలో జరిగిన పత్రికా సమావేశంలో ఆయన యిలా అన్నారు 'జాతీయంచేసే ఆలోచనే లేదు. థియేటర్లను వెంటనే జాతీయంచేసే ఉద్దేశంలేదు అన్న మాటలకు, థియేటర్ యజమానులు కలవరపడినట్టు తెలుస్తూంది. వాళ్ళు నిశ్చింతగా వుండవచ్చు' అన్నారు మంత్రి.

'సెన్సారు నిబంధనలను మార్చడం, కోస్లా కమిటీ సిఫారసులను పరిశీలించిన మీదటే జరుగుతుందని చెప్పగలను, అన్నారు అమాత్యులు గుజరాల్.

## వాణిశ్రీ బర్త్‌డే

ఆ మేడ ఒక సంపన్నుడిది. అతగాడి పేరు నారాయణరావు. ఆ నారాయణరావు కూతురే సంధ్య. ఆమె పుట్టినరోజు, దీపావళి పండుగరోజు ఒకేనాడు గావడం విశేషం. బంధు, మిత్రులందరూ సకాలంలో విచ్చేసి, సౌభాగ్యవతి సంధ్యకు శుభాశీస్సులు పలికారు. తన కాలేజీ విద్యార్థి మాధవ్‌ను కూడా బర్త్‌డేకి ఆహ్వానించింది. సంధ్య. అతగాడు రానే వచ్చాడు. సంధ్య తమ్ముడు వాసు టపాకాయలు కాల్చడం ప్రారంభించాడు ఆ శబ్దం



'విచిత్ర బంధం'లో నాగేశ్వరరావు, వాణిశ్రీ.

# మీ బిడ్డకు దృఢమైన ఆరోగ్యవంతమైన పళ్లు, ఎముకలు ప్రాప్తించుగాక!

## మీ బిడ్డకు కాల్షియం శాండోజ్ శ్రీరామ రక్ష!

స్తన్య పోషణ పొందుతున్న బిడ్డకు ఎముకలు, పళ్లు దృఢముగా, ఆరోగ్యముగా పెరుగుటకు కావలసిన కాల్షియం పూర్తిగా తల్లి పాల నుండి లభ్యం కావాలి.

తల్లి కాల్షియం శాండోజ్ సేవిస్తే, ఆమె దేహమునకు అవసరమైన కాల్షియం సులభంగా లభిస్తుంది. ఆమె పాలలో కాల్షియం సమృద్ధిగా ఉంటుంది.

కమ్మని రాస్ప్బెరీ రుచి గలిగి, చప్పరించుటకనువైన బిళ్లల రూపంలో, పరిశుద్ధమైన కాల్షియమును లభింప చేస్తుంది కాల్షియం శాండోజ్. రోజుకు 4-6 బిళ్లలు ఇస్తే చాలు. ఎముకలు, పళ్లు, దృఢంగా పెరగటమేకాక పి. డి. B12 విటమిను ప్రయోజనం కూడా లభిస్తుంది.

కాల్షియం ఉత్పత్తులలో యావత్ప్రపంచములో సిద్ధహస్తులైన శాండోజ్ వారిచే అది తయారు చేయబడింది.

రోజూ కాల్షియం శాండోజ్ సేవించండి. మీ బిడ్డ జీవితమునకు దృఢమైన పునాది వేయండి!

**కాల్షియం-శాండోజ్®**




ప్రతి రోజు ప్రతి వారికి

దాలెంతరాలికి మామూలు మనిషికన్నా 3 రెట్లు ఎక్కువ కాల్షియం అవసరం. మీరు దాన్ని పొందుచున్నారా?



.dCP/CS/6d TEL



'కాలం మారింది'లో గీతాంజలి, చంద్రమోహన్.



'ఇల్లు—ఇల్లాలు'లో కృష్ణ, వాణిశ్రీ.

# సినివమా

భరించలేని నారాయణరావు తన గదిలోనికి వెళ్లి తలుపులు మూసుకున్నాడు. ఇంటి బయట పాట ప్రారంభమైంది. ఏమని?

సంధ్య : చీకటి వెలుగుల రంగేళీ
జీవితమే ఒక దీపావళీ.

మాధవ్ : అందాల ప్రమిదల
ఆనంద జ్యోతుల
ఆశల వెలిగించు దీపాలవెల్లి.

అంటూ ఆనందోత్సాహంతో పరవశించి పాడసాగారు. 'కట్' అన్నారు దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు. ఈ సన్నివేశం అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్ వర్ణచిత్రం 'విచిత్ర బంధం'లో కనిపిస్తుంది. ఆచార్య ఆత్రేయ కలం, మహదేవన్ సంగీతం, సెల్వరాజ్ ఛాయాగ్రహణం నిర్వహించ, సంధ్యగా వాణిశ్రీ, మాధవ్‌గా నాగేశ్వరరావు నటించారు. ప్రముఖ నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు నిర్మించిన 'విచిత్రబంధం' ప్రముఖ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి 'విజేత'కి తెర రూపం. అన్నపూర్ణా విడుదల.

## కాలంమారిందిలో వయస్సుతెచ్చిన తంటా

సంధ్యా సమయం. ప్రకృతి పల్లవించింది. మధురమైన మలయమారుతం వీయసాగింది. పరస్పరానురాగబద్ధులైన ప్రేమికులు చల్లగాలి తాకిడికి పరవశం చెందారు. మనస్సులు ఒకటై, చేరువై, బిగి కౌగిలిలో వుండిపోవాలనుకున్నారు. అనురాగం అవధులు దాటి, నోట మాట రాలేదు యిద్దరిలో ఒక్కరికీ. పెదవి చెప్పలేని భావాన్ని హృది పలికింది. నల్లని ఆ కన్నులు కూడా సన్నజాజులై వెన్నెలలే ప్రసరించాయి. ఆ వాతావరణం, పరిసరాలు ఆ ప్రేమ జంటలో ఎన్నో ఆశలను చిగురింపచేసాయి. వీటన్నిటికీ తోడుగా నేను వున్నాను అంటూ జలపాతం అందంగా ప్రవహించసాగింది. ప్రేమ జంట హాయిగా, జల్సాగా ఆడుతూ, పాడడం మొదలెట్టారు. పాటను, అమ్మాయి ప్రారంభించింది.

ఏమిటయ్యా సరసాలూ
ఎందుకయ్యా జలసాలూ
ఓ. సోగ్గాడా! ఆపవయ్యా
నీ అల్లరి చిల్లరి వేషాలు

అనడమే తరువాయి అబ్బాయి అందుకున్నాడు.

ఏమిటి పిల్లా నా తప్పూ
అవునో కాదో నువ్వు చెప్పు
అదరగొట్టినా, బెదరగొట్టినా
వదలిపోదులే మన వలపు

అంటూ ఆమెను తన కౌగిట బిగించాడు. 'కట్' అన్నారు దర్శకుడు కె. విశ్వనాథ్. ఈ దృశ్యం మమతా ప్రొడక్షన్స్ 'కాలం మారింది'లో కని

పిస్తుంది. కొసరాజు, రాజేశ్వరరావు, అశోక్‌కుమార్ బాధ్యత వహించిన యీ సన్నివేశంలో అమ్మాయిగా గీతాంజలి, అబ్బాయిగా చంద్రమోహన్ నటించారు. పత్రికా రచయిత వాశిరాజు ప్రకాశం నిర్మించే చిత్రం యిది. లక్ష్మి విడుదల.

## మాతృమూర్తిగా అంజలీదేవి

విశ్వజ్యోతి పిక్చర్స్ నిర్మిస్తున్న 'మాతృమూర్తి' చిత్రం షూటింగు పూర్తయింది. త్వరలో రీ-రికార్డింగు జరుపుకుని, ప్రేక్షకులకు దర్శన మివ్వబోతుంది. ఈ చిత్రంలో మాతృమూర్తిగా అంజలీదేవి నటించింది. మానాపురం అప్పారావు దర్శకుడు.

## మూడు జంటలు

పై చిత్రానికి రాజశ్రీ, సముద్రాల రచన్ను, పెండ్యాల సంగీతాన్ని, స్వామి ఛాయను, కుమార్ కళను నిర్వహించారు. ఈ చిత్రంలో కనిపించేవి మూడు యువ జంటలు. ఒక జంటగా సరోజాదేవి—హరనాథ్. రెండవ జంటగా చంద్రమోహన్—అనిత., మూడవ జంటగా రాజబాబు—రమాప్రభ నటించారు. ముఖ్యపాత్రలను రావి కొండలరావు, పండరీబాయి, ధూళిపాళ, జ్యోతిలక్ష్మి పోషించారు. కథానాయిక తండ్రి భూమికను గుమ్మడి నిర్వహించారు.

'మనిషి మనుగడకు వలసినది డబ్బుకాదు. మంచి మనస్సు, మంచి గుణం' అనేడి నీతిని చెప్పే కథ యిది. ఈ చిత్రాన్ని కె. సత్యనారాయణ రాజేంద్రకుమార్ నిర్మించారు, శ్రీఫిలింస్ పంపిణీని చేపట్టారు.

## డి. బి. ఎన్. కొత్త చిత్రం

అమర సందేశం దగ్గర్నుండి అన్నదమ్ములు వరకు ప్రజాభిమానాన్ని చూరగొన్న కథలనే తెరకెక్కించిన డి. బి. నారాయణ యిటీవల విడుదల చేసిన 'అబ్బాయిగారు—అమ్మాయిగారు' చిత్రంలో ప్రజలకు కావలసినదాన్ని అందించలేకపోయారు. అందువల్ల ఆశించినంత ఆదాయాన్ని తేలేకపోయింది. అందుకే నవంబరునుండి మరొక మంచి కథను సెల్యులాయిడ్‌పైకి ఎక్కించడానికి నిర్ణయించారు. డి.బి. ఎన్. హీరో కృష్ణ, హీరోయిన్ వాణిశ్రీ తమ సంపూర్ణ సహకారాన్ని యివ్వడానికి సిద్ధపడ్డారు. వి. రామచంద్రరావు దర్శకుడు.

## కృష్ణ చేసే మంచి పని

ఆంధ్రదేశంలో కరువు విలయతాండవం చేస్తున్న విషయం మనందరికీ తెలుసు. ఎప్పుడూ, యింత దారుణమైన పరిస్థితిని విధి మనకి కల్పించలేదు.



'పెద్దకొడుకు'లో శోభన్‌బాబు, కాంచన.



'కులగౌరవం'లో రామారావు, జయంతి.

# సినిమా

తిండిలేక, నీరు దొరక్క ప్రజలు నానా అవస్థలకి గురి అవుతున్నారు. కరువు బాధితులకు హీరో కృష్ణ కొంత సహాయాన్ని చెయ్యదలిచారు. అందుకే ఒక పథకాన్ని ఆలోచించారు.

హీరో కృష్ణ తన ట్రూపుతో ఆంధ్రదేశంలో వివిధచోట్ల నాటక, నృత్య ప్రదర్శన లిచ్చి, తద్వారా వచ్చే డబ్బును కరువు నివారణ నిధికి యివ్వడానికి నిశ్చయించారు. ఏ ప్రజల ఆదరణతో తను యింతవాడు అయ్యాడో, ఆ ప్రజలు యిబ్బందికి గురి అయినప్పుడు, వారిని ఆదుకోవడం తన కనీస ధర్మంగా భావిస్తున్న కృష్ణను మనసున్న మంచివాడు అంటే తప్పా?

## జెమినీలో జగన్

'మానవుడు—దానవుడు' చిత్రంలో జగన్ వేషంలో అసమాన నటన్ను ప్రదర్శించిన శోభన్‌కి జెమిని ఆఫర్ వచ్చింది. ఫ్యాన్సీ ప్రైజును యిస్తున్నారట. ఆయనకి జంటగా మేటినటి వాణిశ్రీ నటిస్తుందట. ఏమయినా, శోభన్ ఒక్క వెలుగు వెలిగిస్తున్నాడు.

## సమతలో ద్విపాత్రాభినయం

సమతచిత్ర తలపెట్టిన చిత్రంలో మానవుడు (శోభన్) ద్విపాత్రాభినయం చేస్తాడు. తండ్రి, తనయుడి పాత్రలవి. నాయిక పాత్రను జయంతి ధరిస్తుంది. ఛటర్జీ నిర్వహణలో జనవరినుండి సెట్స్‌కి వెళ్లే యీ చిత్రానికి కె. ఎస్. ప్రకాశరావు దర్శకుడు. రచన్ను ఆదివిష్ణు, ఛాయన్ను సుకదేవ్, కూర్పున్ను అంకిరెడ్డి, సంగీతాన్ని చక్రవర్తి నిర్వహిస్తారు.

## కృష్ణ — జమున

'మేనకోడలు' తర్వాత కృష్ణ—జమున జోతీశేఖర్‌బాబు నిర్మించబోయే చిత్రంలో జంటగా కనిపిస్తారు. హీరో కృష్ణది డాక్టర్ పాత్ర. ఈ చిత్రానికి పినిసెట్టి మాటలన్ను, జి. కె. రాము ఛాయను, మహదేవన్ సంగీతాన్ని నిర్వహిస్తారు. దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి. జోతి విడుదలచేసే యీ చిత్రంలో కృష్ణంరాజు ఒక ముఖ్యపాత్రను పోషిస్తారు.

## కృష్ణ — కాంచన

గౌరీ శంకర్ పిక్చర్స్ నిర్మించే చిత్రంలో కృష్ణ, కాంచన దంపతులుగా నటిస్తారు. కృష్ణ పోలీస్ యిన్‌స్పెక్టర్. ఇందులో కూడా కృష్ణంరాజు ఒక ముఖ్య పాత్రను ధరిస్తున్నారు. గుమ్మడి వీరయ్య, ఆర్. కోటీశ్వరరావు నిర్మిస్తున్న యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

పై చిత్రానికిగాను, సెప్టెంబర్ 12 న జి. కె. వెంకటేష్, దాశరధి లిఖించిన పాటను, జెమినీ కోటీశ్వరరావువద్ద రికార్డింగు జరిపారు. ఎస్. పి. బాలసుబ్రమణ్యం పాడిన ఆ పాట

పల్లవి : 'చిలకలాటి చినదానికి అలక అందము
ఆ అలక తీరిపోగానే అదే బంధము.'

పైన పేర్కొన్న పాటను సెప్టెంబర్ 25 న ప్రారంభమయ్యే మొదటి షెడ్యూలులో హీరో, హీరోయిన్లపై చిత్రీకరణ జరుగుతుందని, నిర్మాణ సారధి నల్లంరెడ్డి ప్రసాద్ చెప్పారు. ఈ చిత్రానికి పినిసెట్టి రచన్ను, మల్లీ యిరానీ ఛాయను, వీరప్ప కూర్పును, సోమనాథ్ కళను, రాధాకృష్ణ సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ప్రధాన పాత్రలను అంజలీదేవి, రమాప్రభ, సంధ్యారాణి, చంద్రమోహన్ ధూళిపాళ, అల్లు రామలింగయ్య, ముక్కామల ధరిస్తారు. తారక రామ విడుదల.

## జయంతికి పట్టినయోగం

తమిళ చిత్రాల్లో, కన్నడ చిత్రాల్లో ఉత్తమ నటిగా గుర్తింపబడిన చాలాకాలానికి జయంతిని తెలుగువాళ్లు గుర్తించారు. ఆమెచేత మంచి వేషాలను వేయిస్తున్నారు.

ఇటీవల జయంతి నటించిన శ్రీధర్ ప్రొడక్షన్స్‌వారి 'జీవితం' రషస్‌ని చూశాను. అమ్మోయ్! ఎంత చక్కగా నటించింది. డైలాగ్ డెలివరీ, భావ ప్రకటనతో సింక్ అయిన నటన ఆమెలో కనిపించింది. 'జీవితం' చిత్రం జయంతి నట జీవితంలో కొత్త శకాన్ని ఆరంభిస్తుంది.



గౌరీశంకర్ పిక్చర్స్ పాటల రికార్డింగ్ సందర్భంలో తీసిన చిత్రం.

## మీకు తెలుసా?

ప్రముఖ దర్శకుడు విజయానంద్ ప్రస్తుతం ఆరు హిందీచిత్రాల్లో కథానాయకుడట. తమ్ముడు నటించడం అన్న దేవ్‌కి యిబ్బందిగా వుందట.

విలన్‌గా వున్న శత్రుఘ్నసిన్హా, షర్మిలాతో కథానాయక పాత్రను పోషిస్తున్నాడు.

హిందీనటి నందాకి యీమధ్య జోతిష్యం మీద విపరీతమైన నమ్మకం కుదిరిందట.

నటి మౌసమీఛటర్జీకి అపెండిక్స్ ఆపరేషన్ జరిగింది. ఒకనెల రెస్టు తీసుకోవాలట.

వెనిస్ ఫిలిమ్ ఫెస్టివల్‌తో చార్లీచాప్లిన్‌కి 'బంగారు సింహం' లభించిందట.

సత్యజిత్‌రే 'సీమబద్దా'కి వెనిస్ సినిమాటోగ్రాఫ్ ప్రెస్ అవార్డు వచ్చింది.

## మూడు చిత్రాల్లో దంపతులు

శోభన్‌బాబుకు అర్ధాంగిగా జయంతి మూడు చిత్రాల్లో నటిస్తుంది. శ్రీధర్ ప్రొడక్షన్స్‌వారి 'జీవితం', అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైసెస్ చిత్రం, సమత చిత్ర ప్రొడక్షన్ నెం. 1 లో వీరిద్దరినీ దంపతులుగా చూడబోతున్నాం.

'కుల గౌరవం'లో ఎన్టీ ఆర్ కి భార్యగా 'బంగారు బాబు'లో అక్కినేనికి సోదరిగా జయంతి నటిస్తుంది. 1973 ఆమెకి ఆశాజనకంగా వుండే సూచనలు కనిపిస్తున్నాయి.

## గుమ్మడి చెల్లెలుగా వాణిశ్రీ

నందిని ఫిలింస్‌వారి 'ఇల్లు—ఇల్లాలు'చిత్రంలో గుమ్మడి చెల్లెలుగా వాణిశ్రీ నటించింది. కథానాయకుడి పాత్రను కృష్ణ, ఉప నాయకుడివేషాన్ని కృష్ణంరాజు ధరించారు. కామెడీ భూమికలన్ను రాజబాబు, రమాప్రభ నిర్వహించారు. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

# క్రికెటీర్ సోల్‌కార్ ఇంగ్లండ్ టూర్ ఆటగారు, దేహదారుఢ్యాన్ని కాపాడుకోడానికి ఫిలిప్స్ సైకిలు త్రొక్కుతారు




సోల్‌కార్‌కు బాగా తెలుసు. ఆటలేని సమయంలో తన దేహసౌష్టవం ఎంత ముఖ్యమో. ఫిలిప్స్‌మీద ప్రతి దినం ఒకసారి తిరిగి రావడం వదలుకోడు. ఉత్సాహవంతులైన యువకులకే ప్రపంచ ప్రసిద్ధి పొందిన ఫిలిప్స్. దానికొక అందము, ఠీవి వుంది. నిరంతరాయంగా, సౌకర్యంగా తిరుగుతుంది.

ఇతర ఫిలిప్స్ రకాలు:

| |
|---|
| ఫిలిప్స్ ఒలింపియా (విశిష్టమైన రకము) |
| ఫిలిప్స్ లేడీస్ మోడల్ |

**ఉత్సాహవంతులైన యువకులకు ఫిలిప్స్**



ఇండియాలో తయారీ:
టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా
అంబత్తూరు, మద్రాసు-53
ప్రొప్రైటర్లు:
ట్యూబ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్
మద్రాసు
(ఉపయోగించుటకు రిజిష్టరు కావింపబడినవారు)

T.ICPH-7020

# వాణిశ్రీ మామయ్యగా గుమ్మడి

కె. సుబ్బిరెడ్డి సమర్పించే 'ఇల్లు—ఇల్లాలు'లో వాణిశ్రీ ద్విపాత్రాభినయం చేసినట్టు పాఠకులకు తెలుసు. తల్లి, కూతురుగా వాణిశ్రీ నటించింది. వాణిశ్రీ మామయ్యగా గుమ్మడి కనిపిస్తారు. ఈ చిత్రానికి ఆరుద్ర—అప్పలాచార్య మాటలను సుకదేవ్ చాయను, మహదేవన్ సంగీతాన్ని నిర్వహించారు. పి. వి. రమణయ్య సారథ్యంలో జె. ఏ. రామసుబ్బయ్య, ఎస్. సుబ్బరాయుడు 'ఇల్లు—ఇల్లాలు' చిత్రాన్ని నిర్మించారు.

# కొత్తకవి కొత్తగాయని

ఉషశ్రీవారి 'ప్రేమ పక్షులు' (నాలుగవచిత్రం) పాటల రికార్డింగు సెప్టెంబర్ 8, 9 తేదుల్లో ప్రసాద్‌లో జరిగింది. ఇందులో రెండింటిని ఉషశ్రీ, మిగిలిన రెండింటిని పరిగి రాధాకృష్ణలు రచించారు. పరిగివారికి సినిమాల్లో పాటలు వ్రాయడం యిదే ప్రథమం. ఆయన వ్రాసిన పాటలో కొంతను మీకు తెలుపుతున్నాను.

గుండె గుండెలో లేదురా మామయ్యా
గుబులే గూడు కట్టుకుందిరా మామయ్యా

అనెడి పాటను, కొత్త గాయని పుష్పలత పాడింది. అశ్వద్ధామ సంగీత సారధి. చిన్నపరెడ్డి దర్శకుడు.

పై చిత్రం షూటింగు అక్టోబర్ 15న వీనస్‌లో ప్రారంభమవుతుంది. డిశంబరుకల్లా షూటింగు పూర్తవుతుంది. ఈ చిత్రంలోని హీరో పాత్రను కొత్త నటుడు ధరించడం ఒక విశేషం.

ఆతడిపేరు ప్రకాష్. ఒక్క దర్శకుడు తప్ప, మిగతా సాంకేతికవర్గం అంతా పాతవాళ్ళే.

# ఏప్రిల్‌నుండి శోభన్ చిత్రం

ఉషశ్రీలో శోభన్ లేకపోయేసరికి, లేనిపోని పుకార్లు బయల్దేరాయి. ముమ్ముందు ఉషశ్రీలో శోభన్ వుండరన్నంతవరకు ప్రచారం సాగింది. ఏప్రిల్‌నుండి శోభన్‌తో చిన్నపరెడ్డి సినిమాను తీస్తారు. శోభన్, చిన్నపరెడ్డి విడివడని స్నేహితులు.

# అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైసెస్‌లో సత్యనారాయణ

ఈ సంస్థను పి. రాఘవరావు స్థాపించారు. జోతికి పంపిణీ హక్కులను యిచ్చారు. ఇటీవల జెమినీ రికార్డింగు థియేటర్లో దాశరధి వ్రాసిన పాటను చక్రవర్తి శబ్ద గ్రహణం చేశారు. ఈ పాటను సుశీల, నూతన గాయకుడు రామకృష్ణ పాడారు.

'శ్రీమతిగారికి తీరనివేళ
శ్రీవారి చెంతకు చేరని వేళ'

అన్నపాటను తక్కువ వాయిద్యాంతో, ఎక్కువకాలం నిలిచిపోయేపాటగా చక్రవర్తి బుర్ర పని చేసింది. ఈ చిత్రానికి కె. విశ్వనాథ్ దర్శకుడు.



ఉషశ్రీ 'ప్రేమపక్షులు' రికార్డింగ్‌లో పుష్పలత, చిన్నపరెడ్డి, అశ్వద్ధామ.



'మాతృమూర్తి'లో సరోజాదేవి.

# సత్యనారాయణ ప్రవేశం

పై చిత్రంలో శోభన్, శారద, జయంతి, అల్లు రామలింగయ్య, రాజబాబు, రావు గోపాలరావు నటిస్తున్నారని లోగడ వ్రాశాను. ఇప్పుడు సత్యనారా నారాయణ ప్రవేశించారు. ఈ కథకి బొల్లిముంత మాటలను, జి. కె. రాము ఛాయను, అంకిరెడ్డి కూర్పును నిర్వహిస్తున్నారు.

# పంపిణీదారుల నిర్ణయం

తమిళనాడు ఫిలిమ్ పంపిణీదారులు గతవారం ఒక మంచి నిర్ణయాన్ని తీసుకున్నారు. వారానికి ఒక చిత్రం మాత్రమే విడుదల చెయ్యాలి. అప్పుడే నిర్మాతలకు కొంతయినా మనశ్శాంతి లభ్యమవుతుంది.

'దమ్ములేని చిత్రాలను ప్రెస్టిజ్‌కోసం ఎక్కువ రోజులు ప్రదర్శించరాదు. నిర్మాతలకు, డిస్ట్రిబ్యూటర్లకు ఏర్పడే భేదాభిప్రాయాలను థియేటరు యాజమానులు తీర్చడానికి ప్రయత్నించాలి. పండగ రోజుల్లో ఎన్ని చిత్రాలయినా ఫర్వాలేదు' అన్న నిర్ణయాన్ని తమిళనాడు పంపిణీదారులసంఘం గైకొనింది.

అలాంటి మంచి నిబంధనావళిని మన తెలుగు డిస్ట్రిబ్యూటర్లు కూడా పాటించడానికి ప్రయత్నిస్తే, అనేక మంది నిర్మాతలు బాగుపడతారు.

—శ్రీనివాస్

కళావాచస్పతి కె జగ్గయ్య
రెండు విభిన్న పాత్రలలో విశిష్టంగా నటించిన



# వారఫలం

**13-10-1972 శుక్రవారం మొదలు**
**19-10-1972 గురువారం వరకు**

**మేషం** : ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృషభం** : అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాలూ బాగుంటాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం** : మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తివ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది

**కర్కాటకం** : వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి వారం మధ్యలో పోటీదారులలో గౌరవం బాగుంటుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**సింహం** : మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**కన్య** : అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ఏ వ్యవహారంలోనైనా యితరుల మీద ఆధారపడడం తగదు.

స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**తుల** : అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాల్లో వాయిదా పడతాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృశ్చికం** : మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**ధనుస్సు** : వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగుంటాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి. సాహసములో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**మకరం** : లాభం రావలసిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం మధ్యలో వృత్తివ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలించగలవు. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కుంభం** : వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో, మీ కృషికి ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం** : అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది, బంధువులకు సహాయం చేస్తారు.

—సుభాష్



# ఫారిన్ రిటర్న్డులు లేక స్వదేశీ ఉద్యోగ పర్వాలకు అతీతులు

లేళ్ళపల్లి వెంకటలక్ష్మీనారాయణ

## మూడవ కథ

## లక్ష్యోపాయాలు-లక్ష్యసాధన



మర్రోజు ప్రొద్దున్నే నిరుద్యోగి రిసర్చి స్కాలర్ దగ్గరికొచ్చాడు. రిసర్చి స్కాలర్ డిపార్టుమెంటుకు బయల్దేరబోతున్నాడు.

'నాతో కథ చెబుతానన్నావ్... చెప్పు... పురాణకాలంలో కూడా వుద్యోగాలకు ఫారిన్ వెళ్ళిరావాలనే నియమం వుందన్నావ్; ఏమిటా కథ?' అన్నాడు స్వదేశీ నిరుద్యోగి. రిసర్చిస్కాలర్ మొదలెట్టాడు.

'పూర్వం కైలాసంలో జరిగింది కథ. ఇప్పటికీ రికార్డులున్నాయ్. ఇక్కడ పోస్టుకు మరెక్కడికో వెళ్లిరావాలన్న నియమం అప్పట్నుంచే వచ్చింది. ఇంతకూ అప్పు డక్కడ జరిగిన సంగతిది. గణాధిపతి పోస్టు ఖాళీ అయ్యింది. అప్పట్లో ఖాళీ అవ్వలేదు; అది సృష్టించారు. ఉన్న పోస్టులు రావాల్సినవాళ్ళ కివ్వకుండా వాళ్ళక్కావాల్సిన వాళ్ళకివ్వటం, కావల్సిన వాళ్ళకోసం పోస్టులు క్రియేట్ చెయ్యటం ... యివన్నీ అప్పుడూ వున్నయ్. కాని గణాధిపతి పోస్టు క్రియేటయ్యాక యిద్దరభ్యర్థుల్తేలారు రంగం మీద. ఒకడు కుమార స్వామి; మరొకడు వినాయకుడు. వీళ్ళిద్దర్లోంచి సెలక్టు చేసుకునేందుకుగ్గాను ఫారిన్ వెళ్ళిరావటం అన్న క్వాలిఫికేషన్ పెట్టారు. ఫారిన్ వెళ్ళటమంటే యేదో ఒక విదేశం వెడితే సరిపోదు; యిప్పుడింకా నయం—యే వక్క దేశంవెళ్ళి వొక రోజున్నా ఫారిన్ వెళ్ళటం క్రిందే లెక్కేస్తున్నారు. కానీ ఆ రోజుల్లో కుమారస్వామినీ, వినాయకుణ్ణీ ప్రపంచమంతా తిరిగిరమ్మన్నారు. చూశావా మరి! ఫారిన్ వెళ్లిరావటం క్వాలిఫికేషన్లలో వకటిగా కాకుండా, అదే క్వాలిఫికేషన్‌గా యెప్పుడోనే నిర్ణయం చేశారు' అని ఆపుజేశాడు రిసర్చిస్కాలర్.

నిరుద్యోగి సూటిగా రిసర్చిస్కాలర్ వంక గంభీరంగా చూశాడు. రిసర్చిస్కాలర్ నవ్వాడు...కాస్సేపయ్యాక నిరుద్యోగి యేదో గుర్తుకొచ్చినట్టు తలాడించి ఫెళ ఫెళా నవ్వాడు. రిసర్చిస్కాలర్ నవ్వాపుకుని 'ఏమిటీ కథ?' అన్నట్టు నిరుద్యోగి వంక చూశాడు. నిరుద్యోగి చెప్పటం మొదలెట్టాడు:

'నువ్వు చెప్పిన కథంతటితో అవ్వలేదు. జరగాల్సిందంతా జరగాల్సిన విధంగా తర్వాత జరిగింది. అదంతా ఏంటే ఆ కథ

లోని అసలు 'నీతి' బయటపడుతోంది: నువ్వు చెప్పిందాంట్లో నీతి లేదు; అసలు నీతి, పూర్తిగా ఆ కథ నేం జెబుతాను విను.'

'గణాధిపతి పోస్టుకు ఫారిన్ వెళ్ళి రావటం అందునా ప్రపంచం అంతా తిరిగి రావటం ముఖ్యం గదా అని కుమారస్వామి నెమలి వాహనం యెక్కి 'రంయ్'మంటూ వెళ్ళిపోయాడు. వినాయకునికి ఫారిన్ వెళ్లే ఆర్థికశక్తి, వాహనశక్తీ లేదు. అతగాడి వాహనం శక్తిలేని యెలుక. అసలా వాహనం అప్పట్నుంచుందో, పోస్టులో కెళ్లొచ్చిందో తెలీదు. కంపెనీల్లోని పెద్దుద్యోగస్తులకు కార్లిస్తున్నట్టారోజుల్లో గణాధిపతికి ఎలుకనిచ్చుంటారు. కారణం యేమయినా వినాయకుడు యిల్లు కదల్లేకపోయాడు. అందువల్ల వినాయకుని స్నేహితులు శివుడ్దగ్గరికెళ్ళి—

'యిట్లా ఫారిన్ వెళ్లిరమ్మనటంలోని అంతరార్థం యేమిటి? ఏమిటా రహస్యం? శెలవివ్వండి' అన్నారు.

'ఫారిన్ వెళ్లిరమ్మంటే ఫారిన్ వెళ్ళి తిరిగిరమ్మని కాదు. జ్ఞానం వృద్ధి జేసుకొమ్మని వెళ్ళమన్నాను. ఫారిన్ వెడితే అందుకవకాశా లెక్కువ. అందుకే ఫారిన్ వెళ్లాలన్నది నిబంధనగా పెట్టాను'అన్నాడు శివుడు.

'అయితే ఆ జ్ఞానాభివృద్ధి యిక్కడినుంచే సాధిస్తాను' అని వినాయకుడు కైలాసదేశంలోనే వుండి జ్ఞానాభివృద్ధికి పాటుపడసాగాడు. కుమారస్వామికి అందువల్ల ప్రతిదేశంలోని నదిలోనూ స్నానం చేసేటప్పుడు వినాయకుడు కనిపించసాగాడు; ఇండియాలో వున్నవాళ్ళ పేపర్లు ఫారిన్ జర్నల్సులో పడుతుంటే ఫారిన్ వెళ్ళిన యిండియన్స్ చూస్తున్నట్టుగా నన్నమాట ...శివయ్య వినాయకుడి విజ్ఞానాన్ని చూసి యెంతో మెచ్చుకున్నాడు. 'ప్రపంచమంతా తిరిగి సాధించిన జ్ఞానానికంటే కొంచెం యెక్కువే సాధించావ్...నిన్నే గణాధిపతిగా వెయ్యొచ్చున'న్నాడు సంతోషంతో.

ఈ మాటలు విన్న సెలెక్షన్ కమిటీలోని కుమారస్వామి హితుడు ముందుకొచ్చి శివుణ్ణి వుద్దేశిస్తూ హడావిడిగా—

'ఆగండాగండి... కుమారస్వామి ఫారిన్ తిరిగొస్తున్నాడు ...— ఈ పోస్టు కతగాడే తగును. అప్పాయింట్‌మెంటార్డరక్కడికే పంపిద్దాం; లేదా ఆర్డర్తీసుకుని నన్నెళ్లి యిచ్చిరమ్మన్నా యిచ్చొస్తాను. లేదా అతగాణ్ణే రమ్మందాం ... వచ్చేస్తూ వుంటాడీపాటికి...ఆగండి' అన్నాడు.

శివుడు మందహాసం చేస్తూ 'సరే... ఆగుదాం' అంటూ ఆర్డర్ప్రక్కనపెట్టి కూర్చున్నాడు. కుమారస్వామి కొంచెం లేటుగా మరి కొంచెం నీటుగా వచ్చి—

'ఫారిన్ వెళ్లొచ్చాను...య్యా... ఫారిన్ వెళ్లి తిరిగొచ్చాన'న్నాడు భుజాలెగరేస్తూ.

శివుడు మెల్లగా నవ్వుతూ—

'నాయనా! కుమారస్వామీ! ఫారిన్‌వెళ్లి యేం చేసొచ్చావయ్యా' అన్నాడు.

'ఇంకేం చెయ్యాలి? ఫారిన్ తిరిగొచ్చాన'న్నాడు కుమారస్వామి వూగిపోతూ.

'అందుకే బాబూ...గణాధిపతి పోస్టు వినాయకుని కిస్తున్నాను' అన్నాడు శివుడు.

'అదీ కథ' అన్నాడు నిరుద్యోగి.

'ఆ రోజుల్లో ధర్మం వుంది కాబట్టి 'ఫారిన్‌వెళ్లి యేం జేశారు?' అని చూసేవాళ్లు. ఇప్పుడదేం లేదు. ఫారిన్ వెళ్లటమే కావాల్సింది. అందుకనే అప్లికేషన్లలో 'ఏ దేశం వెళ్లావ్?', 'ఎన్నేళ్లు లేదా ఎన్నాళ్లున్నావ్?' అనడుగుతున్నారు గానీ 'ఏం జేశావ్?' అన్న సంగతెవ్వరూ పట్టించుకోవటం లేదు' అన్నాడు నిరుద్యోగి లేస్తూ. రిసర్చి స్కాలర్ ముఖం మాడ్చుకుని, కాళ్లు ముడుచుకుని మంచం మీద పడుకున్నాడు. ఇతగాడు ప్రతిరోజులోనూ యెక్కువభాగం పైన చెప్పిన పనుల్లో రెండో పన్జేస్తూ వుంటాడు ... నిరుద్యోగి డిపార్ట్‌మెంట్ వేపుగా పోస్టు ఫీసుకు బయల్దేరాడు. నిరుద్యోగి వెళ్లిన కాస్సేపటికి—

'గుడ్‌మాణింగ్...హవ్వార్‌యువ్, గై' అంటూ గాలిలా ఒకతను రిసర్చి స్కాలర్ రూములోకి జొరబడ్డాడు. లక్షణాలన్నీ ఫారిన్‌వెళ్లి తిరిగొచ్చిన వాడికున్నట్టే వున్నయ్. వేషం అట్లాగే వుంది. భాష కూడా అంతే ... కానీ అతగాడు ఫారిన్ వెళ్లలేదు. వెళ్లాలని తహ తహ లాడుతున్నాడు; వెళ్లొచ్చిన వాళ్లలాగే తళతళ లాడుతున్నాడు. వెళ్లటానికి ప్రయత్నాలు మాత్రం బోల్డు చేస్తున్నాడు. అందులో ప్రథమ భాగంగా యింగ్లీషు సినిమా లెక్కువ చూస్తున్నాడు. వాళ్ళు మాట్లాడినట్లు 'షట్' అని, 'డామ్ దట్', 'డామ్ దిస్' అని, 'బుల్‌షిట్' అనీ... యింకా అనేకం అమెరికన్ 'స్లాంగ్'లో మాట్లాడగలడు. అమెరికన్ 'కౌబాయ్'లా వుంటాడు. ఫారిన్ వెళ్లేవాళ్లని విమానాశ్రయందాకా వెళ్లి సాగనంపుతూ ఫారిన్ వెళ్లేటప్పుడు చెయ్యాల్సిన పనులన్నీ నేర్చుకున్నాడు. వీటన్నిటితో యితగాడిప్పుడు తనని అమెరికాలో పారేసినా తనంతట తాను నిలబడగల్గి నెగ్గుకు రాగలనంటాడు ... అయినా అవకాశం మాత్రం రాలేదు.

ఇతగాడి కెలాగైనా ఫారిన్ వెళ్లిరావాలని మహా వుబలాటంగా వుంది. రిసర్చికని ఈ యిన్‌స్టిట్యూట్‌లో జేరి మొదటి రెండు సంవత్సరాలూ రిసర్చిసీటు (డాక్టరల్ ప్రోగ్రాంలో) కోసం ప్రతి విదేశీ విశ్వవిద్యాలయానికీ అప్లయ్ జేశాడు. జి. ఆర్. ఇ. (గ్రాడ్యుయేట్ రికార్డ్ ఎక్జామినేషన్)కు కూర్చున్నాడు. 'టోఫెల్' (TOFEL) అంటే టెస్ట్ ఆఫ్ ఇంగ్లీష్ యాజ్ ఎ ఫారిన్ లాంగ్వేజ్, కూడా కూర్చున్నాడు. వీటిల్లో గ్రేడ్సురాసి అప్లయ్‌చేస్తే యే యూనివర్సిటీలోనూ ప్రవేశం దొరకలేదు. లైబ్రరీకి వెళ్లి 'వరల్డ్ ఆల్మినాక్' పుస్తకం చూసి ప్రతిదేశంలోని ప్రతి మారుమూల యూనివర్సిటీకి అప్లయ్ జేశాడు. ఈ ప్రయత్నాలూ కలిసిరాలేదు. జవాబులు అడ్మిషన్ లెటర్తో కలసిరాకుండా రిగ్రెట్ లెటర్తో కలిసొచ్చేవి... ఇంతలో ఈ యిన్‌స్టిట్యూట్‌లో నాలుగేళ్లు గడిచినయ్. ప్రొఫెసర్తో మంచిగా వుంటూ, అవీ యివీ పంచిపెడుతూ వుండటంవల్ల పి. హెచ్. డి. రాకముందే అతగాణ్ణి సీనియర్ టెక్నికల్ అసిస్టెంటనే జూనియర్ స్టాఫ్ పొజిషన్లోకి తీసుకున్నారు.

ఇక డాక్టరల్ ప్రోగ్రాం వదిలివేసి పోస్ట్ డాక్టరల్ ప్రోగ్రాంకు అప్లయ్ చెయ్యడానికో పద్ధతి కనిపెట్టాడతగాడు. ఫారిన్ జర్నల్‌చూసి తనప్లయ్‌చేసే యూనివర్సిటీలోని ప్రొఫెసర్లెవరి పేరన్నా దాంట్లో పడితే వెంటనే ఫలానా పేపరు

ఫలానా జర్నల్‌లో పడిందని విన్నాననీ, ఆ జర్నల్ తన యిన్‌స్టిట్యూట్‌కు రావటం లేదనీ, ఆ పేపర్ చాలా బాగుందని అబ్‌స్ట్రాక్ట్‌ద్వారా మరోచోటునుంచి గ్రహించాననీ, ఆ పేపర్తనకెంతో వుపయోగిస్తుందనీ, తామిద్దరూచేసే రిసర్చి చూడగా ఒకటేగానే తోస్తోందని, 'రీ ప్రింట్' వకటి పంపితే యెంతో కృతజ్ఞుణ్ణనీ, ఆ పేపర్ రీ ప్రింటొచ్చేంతవరకూ తన రిసర్చి ఆగిపోతుందనీ... యిలా చాలా రాస్తాడు. రీప్రింటొచ్చాక దాన్నోమూల పడేసి వో యిరవై రోజుల్తర్వాత ఆ ప్రొఫెసర్‌కో వుత్తరం రాసి దాంట్లో తను కొద్దికాలం లోనే థీసిస్ సబ్మిట్ చెయ్యబోతున్నట్టు, తర్వాత ఆ ప్రొఫెసర్ క్రింద పనిచెయ్యాలనే కోరికతో వున్నట్టు తెలియజేస్తాడు.. యిలా చాలా రాశాడు. కానీ 'నీకు ఎడ్వాన్స్‌డ్ మేథమెటిక్సు' వచ్చా అనో, స్టాటిస్టిక్స్ వచ్చా అనో లేదా 'థీసిస్ సబ్మిట్ చెయ్ చూద్దాం; థీసిస్ సబ్మిట్ చేస్తావని ఆశిస్తూ, శుభాకాంక్షలు తెలుపుతూ' అంటూ జవాబులొచ్చేవి. మరికొందరు

## ఫారిన్ ...

ప్రొఫెసర్లు తాము మరో అయిదేళ్లవరకూ 'బిజీ'గా వుండబోతున్నట్టు తెలియజేశారు...మొత్తానికి దారి కూడా గమ్యానికి చేర్చలేదు.

ఇప్పుడు మూడోదశ కొచ్చాడు. ఇప్పుడు ప్రతిరోజూ లైబ్రరీకి వెడుతున్నాడు. 'ఇతగాడింతకాలం థీసిస్ విషయంలో జాగు చేశాడుగానీ యిప్పుడు బాగుపడుతున్నట్టున్నాడు' అనుకున్నారందరూ. ఇంతకూ లైబ్రరీకి వెళ్లి యితగాడ్చేసే పని యిది: కొన్ని 'జర్నల్సు'లో చివరి పేజీలలో అదొచ్చేదేశంలోని వుద్యోగాల ప్రకటనలు (ఆ సబ్జక్టుకు సంబంధించినవి) వేస్తూ వుంటారు. ఇతగాడివన్నీ రాసుకొచ్చేందుగ్గాను రోజూ లైబ్రరీ కెడుతున్నాడు. డిపార్ట్‌మెంట్‌లో 'యెక్కడి కెడుతున్నావ్?' అంటే 'లైబ్రరీకి' అని ధీమాగా చెబుతాడు. ఇంతవరకూ యితగాడిట్లా చాలా వాటి కప్లయ్ జేశాడు. డిపార్ట్‌మెంట్‌లో యితగాడి ప్రక్కనో ఉక్కు అలమరా



వుంది. దాంట్లో వున్న అయిదు అరలకూ అయిదు కాగితాలంటించాడు; వాటి మీదిలా రాసుంది: 1) యు. ఎస్. ఏ 2) కెనడా 3) యు కె 4) ఆస్ట్రేలియా 5) మిసలేనియస్. ఈ దేశాల్లోని యూనివర్సిటీల లోనూ, వ్యాపారసంస్థలలోనూవున్న వుద్యోగాలకోసం చేసే కరెస్పాండెన్సంతా ఆయా అరల్లో వుంటుంది. ఈ మధ్యనే తన పరిశోధనలకు మరో అలమరా కావాలని 'రిక్విజిషన్' పెట్టాడు. నెల జీతంలో మూడో వంతో నాలుగో వంతో యీ కరెస్పాండెన్సుకు కేటాయించాడు.

ఇతగాడి పేరు రామ్మూర్తి. ముమ్మూర్తులా 'బ్రూసు — సాలీడు' కథలోని 'బ్రూసు' మాదిరే వుంటాడన్నారు కొందరు. ఈ లోపల మరో వేపునుంచి మరో ఆలోచనాబడి (స్కూల్ ఆఫ్ థాట్) బయల్దేరింది. 'రామ్మూర్తి ముమ్మూర్తులా బ్రూసు మాదిరుంటాడన్నదానికి మేం వప్పుకోం' అన్నారు వీళ్లు.

'ఎందుకని ?' అని నిలవేశారు మొదటి వాళ్ళు. నిజంగానే నిలవేశారు. ఇలాంటి ఇన్‌స్టిట్యూట్లలో పదిన్నర ప్రాంతంలో కాఫీలకని కట్ట కట్టుకుని జట్లుగా బయల్దేర్తారు మనుష్యులు. తాబేలు తాతల మాదిరి నడుస్తూ చర్చించుకుంటూ వుంటారు. చర్చ పరాకాష్ఠనందుకుంటే నిలిచిపోయి వాదించుకుంటూ వుంటారు.

'రామ్మూర్తి ముమ్మూర్తులా బ్రూసు మాదిరుంటాడని మేమంటే మీరెందు కొప్పుకోరు' అని జట్టు సంతటినీ రోడ్డుప్రక్కన గట్టు మీద నిలవేశారు మొదటి వాదం లేవదీసినవాళ్ళు. ఇలా నిలవేసేందుకు వీలుగా బోల్డు వాదాలు నిలవజేసుకుంటారీ జట్లలోని సభ్యులు.

'ఎందుకనేముంది ? మీరు బ్రూసెట్లా వుంటాడో చూసినట్లు 'రామ్మూర్తి బ్రూసు పోలిక' అని చెప్పారు. మీరు బ్రూసుని చూశారా ?' అన్నారు రెండో గ్రూపువాళ్లు.

'పోనీ మీరు బ్రూసుని చూశారా ?' అన్నారు మొదటి గ్రూపువాళ్ళు.

'లేదు' అంది రెండో గ్రూపు.

'అలాంటప్పుడు మేం రామ్మూర్తిని బ్రూసుతో పోలిస్తే మీరెలా అభ్యంతరం చెప్పగలరు ?' అన్నది మొదటి గ్రూపు.

## మీ ముఖ కాంతికి కొన్ని కళలను తీరుస్తుంది




మెత్తగా,
మృదువుగా,
యౌవనంగా
వుంచుతుంది–ఏదో తెలుసా ?

పాండ్స్ వ్యానిషింగ్ క్రీము. అందులో గల ప్రత్యేకమైన హ్యూమెక్టెంట్ దుమ్ము వాతావరణాలకు తగిన సంరక్షణను ఇవ్వటమేగాక చర్మానికి సహజంగా వుండవలసిన ఆర్ద్రతకు భంగం రానీయదు. తేలికగా మంచులా వుండే పాండ్స్ వ్యానిషింగ్ క్రీము వాడండి. మ్యాట్ ఫినిష్‌కు దానిని ఒక్కటే వాడవచ్చు. లేకపోతే మీ సింగారం చెక్కు చెదరకుండా గంటలకొద్దీ వుండడానికి పౌడర్ పునాదిగా వుపయోగించవచ్చు. 4 సైజులలో లభించగల వ్యానిషింగ్ క్రీము ఇదొక్కటే. ఎకానమీ - లార్జి - మీడియము - స్మాలు.

## పాండ్స్ వానిషింగ్ క్రీమ్

విశిష్టమైన పౌడరు పునాది.

చీస్‌బ్రో పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమిత బాధ్యతతో యు ఎస్ ఎలో స్థాపితము)

రెండో జట్టు కాస్సేపు మాట్లాడే కుండా తర్వాత—

'రామ్మూర్తసలు బ్రూను కాదు' అన్నది.

'మళ్లీ అదేం మాట...యింతకు ముందు బ్రూను పోలికలో లేడన్నారు. ఇప్పుడసలు బ్రూను లక్షణాలే లేవంటారా? ఇదేం మాట?!' అన్నది మొదటి గ్రూపు.

'అవును ... రామ్మూర్తసలు బ్రూను కాదు...అతగాడా కథలోని సాలీడు' అన్నారు ...దీనికి 'సాలిడ్' సపోర్టుందని వాదించారు. ఇందుకు తగిన సాక్ష్యం మరో యేడాదికల్లా చూపిస్తాం అన్నారు. ఆ మాట మీద నిలబడి, నిలబడినచోటు వదలి కాఫీక్లబ్‌వేపు బయల్దేరారు. కాఫీ క్లబ్‌నుంచి డిపార్ట్‌మెంటుకొచ్చి పోస్టు చూసుకుని యిళ్ళకు పోతారు. ఇదీ వాళ్ళ దినచర్య.

ఇలా ఫారిన్ ఛాన్సుకోసం ప్రయత్నిస్తున్న రామ్మూర్తి డిపార్ట్‌మెంట్‌కే పద్మనాభం వచ్చాడు. సహజంగానే రామ్మూర్తి పద్మనాభం దగ్గిరకు చాలాసార్లు వెళ్లాడు; ఈ మధ్యనే పద్మనాభానికి దగ్గిరయ్యాడు.

రామ్మూర్తి గారిలా రిసర్చి స్కాలర్ రూంలోకొచ్చి మళ్లీ 'షీయూ లేటర్' అంటూ తిరిగెళ్లిపోయాడు. సరాసరి పద్మనాభం రూముకు బయల్దేరాడు. పద్మనాభానికింకా ఇన్‌స్టిట్యూట్‌వాళ్ళు క్వార్టర్సివ్వలేదు. క్వార్టరు వచ్చేంతవరకూ హాస్టల్లో ఒక గెస్టురూం తీసుకుని దాంట్లో వుండటానికి నిశ్చయించుకున్నాడు. ఇప్పుడు దాంట్లోనే వున్నాడు. రామ్మూర్తక్కడికే బయల్దేరాడిప్పుడు.

పద్మనాభం రూంలో కూర్చుని డ్రస్ చేసుకుంటున్నాడు. ట్రై బిగించి ఒక చిన్న ఆల్బమ్‌లాంటిది తీసి ఒకసారిచూసి లోపల పెట్టేశాడు. ఫోటోలు, ఫోటోల పుస్తకాలు చాలామందికి చూపించాడుగాని యిది మాత్రం యెవ్వరికీ చూపించలేదు. 'దాంట్లో యేమున్నయ్యా?' అని అందరికీ అనుమానం. ఫారిన్‌లో యేదో గ్రంథం నడిపాడేమో ననుకున్నారు; దానికా బొమ్మలన్నారు. ఇంతలో పకాయన వుండుకొచ్చి—

'అదేంకాదు; అందులో ప్రొఫెసర్ ఖొరానా, ప్రొఫెసర్ చంద్రశేఖర్ ... యింకా నార్లికార్ మొదలైనవాళ్ల ఫోటోలుంటయ్. ఫారిన్‌నుంచి తిరిగొచ్చినవాళ్ళ

## ఫారిన్...

లేవంగానే వాళ్ల ఫోటోలకు దండంపెట్టి, ఓ దండవేసి మరీ బయటకొస్తారు. మరి వాళ్ల మూలంగానే కదా ఫారిన్ వెళ్ళొచ్చిన మిగతావాళ్లకు విలువ. ఖొరానా అమెరికా వెళ్లి అంతపెద్దవాడు కావటం వాళ్ల దృష్టం. నార్లికార్ ఇంగ్లండ్‌వెళ్లి అయిన్‌స్టీన్ సిద్ధాంతంమీద రాద్ధాంతం చెయ్యటం వాళ్ళు చేసుకున్న పుణ్యం. చెట్టు పేర్చెప్పి కాయలమ్ముకోవటం అందువల్లే సాధ్యమయ్యింది' అన్నాడు.

'పద్మనాభం ప్రణామాలన్నీ గావించి ప్రయాణమవ్వబోతూ వేసుకున్న కోటు భుజంమీద నలిగివుండటం చూసి వో చిన్న అయిరన్‌బాక్సు తీసి కోటు విప్పకుండానే కోటుమీద తోముకోవటం మొదలెట్టాడు. సరిగ్గా ఈ సమయంలోనే రామ్మూర్తి తలుపు తట్టాడు; తలుపు బోల్టువూడి గదిలోకి వూడిపడ్డాడు రామ్మూర్తి.

'ఏమిటి? భుజాలకు కాపటం పెట్టుకుంటున్నారా?! నేననుకుంటూనే వున్నాను. మీ భుజాలు కలుక్కుమంటూ వుంటయ్యని. ఈ మూణ్ణెల్లూ భుజాలు మరీ విపరీతంగా యెగరేశారు. అందుకే యిలా అవస్థొచ్చింది' అన్నాడు.

అవీ యివీ మాట్లాడి 'మళ్ళీ అమెరికా వెళ్లిపోదామనుకుంటున్నాను' అన్నాడు పద్మనాభం.

'ఈమాటు మీరెళ్లేటప్పుడు మీ లగేజిలో నన్ను వేసి తీసికెళ్లిపొండి గురూగారూ!' అన్నాడు రామ్మూర్తి.

'ఏంవిటండీ అట్లా అంటారు? మీ కమెరికా వెళ్ళే ఛాన్సొస్తుంది లెండి' అన్నాడు పద్మనాభం.

'ఏమోనండి...అమెరికాలో అవకాశాలు తగ్గిపోతున్నయ్యండి...వియత్నాం యుద్ధం వల్ల ఫండ్సన్నీ అటువేపు వెడుతున్నయ్; అమెరికాలోని యూనివర్సిటీలకు సరిగా ఫండ్సందటంలేదు. అడ్మిషనిస్తున్నారు గానీ ఫైనాన్షియల్ అసిస్టెన్సు రావటంలేదు. ఈ యుద్ధం ఆగిపోతే బాగుండును' అన్నాడు రామ్మూర్తి.

'ఆగినా గొడవేనండోయ్ ... వియత్నాం నుంచి అమెరికన్ సైనికులు యింటికి వెళ్లిపోయినా గొడవే ... వాళ్ళవల్ల బయటు వాళ్ళ కమెరికాలో వుద్యోగాల్దొరకవ్..'

అన్నాడు పద్మనాభం.

'అయితే వియత్నాం యుద్ధం ఆగినా ఆగకపోయినా మనకిబ్బందేనన్న మాట... ఎట్లాగండీ చచ్చేదికై చచ్చేలోగా అమెరికా యెట్లా వెళ్లేది?... ఈ బంగ్లాదేశ్ వ్యవహారంవల్ల కూడా అమెరికాలో మనకు అవకాశాలు తగ్గిపోతున్నట్టున్నయ్...అక్కడి వాళ్లే యిండియాను ఛీకొడుతున్నారు. ఇంక నేను వెళ్లేదెప్పుడో' అన్నాడు రామ్మూర్తి నిట్టూరుస్తూ.

## కోప్రా కిచిడీ

కావలసినవి:—

| | |
|---|---|
| బియ్యం | —2 కప్పులు |
| కొబ్బరి పాలు | —4 కప్పులు |
| శనగ పప్పు | —½ కప్పు. |
| పెసర పప్పు | —½ కప్పు. |
| నెయ్యి | —½ కప్పు. |
| ఉల్లి గడ్డలు | —2. |
| పచ్చి కొబ్బరి | —ఒక ముక్క. |
| పసుపు | —చిటికెడు. |
| కారం | —ఒక స్పూను. |
| ఉప్పు | —తగినంత |
| పోపు గింజలు | —ఒక స్పూను. |

తయారుచేసే పద్ధతి:—

బియ్యం శుభ్రపరచి కడిగి పెట్టుకోవాలి. ఉల్లి గడ్డలు ముక్కలుగా తరగాలి. కొబ్బరి కోరి పెట్టుకోవాలి.

పొయ్యిపైన మందంగా ఉన్న గిన్నెపెట్టి నెయ్యివేసి పోపుచేసి (తాలింపు చేసి) దానిలో ఉల్లిగడ్డ ముక్కల్ని వేసి దోరగా వేయించాలి. దానిలోనే శుభ్రపరచిన శనగ పప్పు, పెసర పప్పులను వేసి, పచ్చి కొబ్బరి కోరుకూడా వేసి వేయించాలి. కాస్త వేగిన తర్వాత కొబ్బరి పాలుపోసి ఉప్పు కారం, పసుపు (కావాలనుకుంటేనే పసుపు వేసుకో వచ్చు.) వేసి కలిపి బియ్యంకూడా వేసి మంచిగా ఉడికిన తర్వాత దించెయ్యాలి. వేడిగా తింటే కోప్రాకిచిడీ, చాలా బావుంటుంది.

ఈ కోప్రా కిచిడీ, చక్కని బలకరమైన ఆహారము. నోటి దుర్గంధము దంతరోగములు, కఫశూలలు, వాత గుల్మలు, కలరా, వాంతులు మొదలగు రోగాలను పోగొట్టడమే గాక దేహ పుష్టినీ, చల్లదనాన్నీ, వీర్యపుష్టినీ కలిగిస్తుంది. నీరసత్వాన్ని, అల సటనీ తీర్చి ఆహ్లాదాన్ని కలిగిస్తుంది 'కోప్రా కిచిడీ'.

—మూర్తి శ్రీ జయ సౌజన్య

JL-6848




# జమ్మివారి లివర్ క్యూర్

—పరిశోధించి, వాడి ఋజువు చేయబడింది.

మన దేశంలో పిల్లలకు ప్రాణహానికరమైన జబ్బులలో లివరు జబ్బు ముఖ్యమైనది.

కామెరలు, లివరు పెరగటం మొదలైన లివరు జబ్బులన్నిటికీ జమ్మివారి 'లివర్ క్యూర్' మేలైన ఔషధమని ఋజువు చేయబడింది.

తుత్తునాగము, ఇనుము, బోరాన్, కాల్షియం మొదలైన లోహాల ధాతువులు చేర్చబడిన జమ్మిస్ 'లివర్ క్యూర్' శాస్త్రప్రకారం తయారైన ఆయుర్వేద ఔషధము.

ఇది జ్వరనివారిణి. జారీ మూత్రవిసర్జనకు సహకరిస్తుంది.

పిల్లల లివరు జబ్బులకు జమ్మివారి 'లివర్ క్యూర్' బాగా జబ్బులను కుదిర్చి లివరుకు బలాన్ని కలిగిస్తుంది.

పిల్లల లివరు సంబంధమైన రోగాలకు జమ్మివారి 'లివర్ క్యూర్' అమోఘమైనదని భారతదేశంలో మంచి అనుభవజ్ఞులైన వైద్యులందరూ అంగీకరించారు.

జమ్మివారి 'లివర్ క్యూర్' పిల్లల లివరు రోగాలకు వాటివాటి ప్రత్యేక లక్షణాలు, పరిణామాలు, పరిస్థితులనుబట్టి మూడు రకాలుగా లభిస్తుంది.

## జమ్మివారి 'లివర్ క్యూర్' —
## 70 సంవత్సరాలుగా నమ్మకమైన ఔషధము.

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్, మద్రాసు-4

తయారుచేయువారు: జమ్మి ఫార్మసూటికల్స్, మద్రాసు-26.

'అన్నట్టే మధ్య ఆస్ట్రేలియాలో యూనివర్సిటీ టీచర్సుకు జీతాలు పెంచార్ట. దాంతో ఇంగ్లండ్ వాసులు ఆస్ట్రేలియా పట్ల మోజు చూపిస్తున్నార్ట...ఇక మనకు ఆస్ట్రేలియాలో కూడా రాదేమో ... కెనడా నకటే మిగిలుంది...ఏవీ లేకపోతే ఆఫ్రికా ఖండంలో యెక్కడికయినా నేను సిద్ధమే... అక్కడ మాత్రం యెక్కడొస్తుంది నాలాంటివాడికి...' అన్నాడు మళ్ళీ నిట్టూరుస్తూ.

'ఇవన్నీ వుంటూనే వుంటయ్ గానీ మీరో పన్చెయ్యండి. అమెరికాకు ఇమ్మిగ్రేషన్ కన్సల్ట్ చెయ్యండి ... కావాలంటే అక్కడున్న మా స్నేహితుడ్చేత 'అఫిడవిట్' యిప్పిస్తాను' అన్నాడు పద్మనాభం.

'అయితే మద్రాసువెళ్లి అమెరికన్ కాన్సులేట్‌లో అప్లికేషన్ తీసుకొని యిచ్చొస్తాను' అన్నాడు రామ్మూర్తి.

'అబ్బే...మీరెందుకు వెళ్లటం? ఉత్తరం రాయండి; అప్లికేషన్ పంపిస్తారు. తర్వాతెట్లాగో మీరు పర్సనల్‌గా వెళ్లాలనుకోండి' అన్నాడు పద్మనాభం.

మరునటివారం మద్రాసెళ్లి అప్లికేషనిచ్చి కొంత ఫీజుకూడా కట్టొచ్చాడు రామ్మూర్తి. అప్పటిగ్గానీ నిద్రపట్టలేదతగాడికి...

భుజాన బాగ్ తగిలించుకుని చెయ్యూపుతూ విమానం వేపు బయల్దేరాడు రామ్మూర్తి. మిత్రులందరూ వెనకనుంచి చెయ్యూపుతున్నారు ... చివరిసారిగా చెయ్యూపి లోపలికెళ్లిపోయాడు రామ్మూర్తి. విమానం బయల్దేరింది ... కొంతసేపటికి ఎయిర్‌హోస్టెస్ హడావిడిగా పరుగెత్తింది. కానీ యేం మాట్లాడలేదు. వెనక్కీ వెనక్కీ చూస్తుంటూ భయంగా తన పనుల్జేసుకుపోతోంది. ఆమె వెనకాలే యింతవరకూ వెనకాల సీట్లో కూర్చున్న ప్రయాణీకుడు జేబులో చెయ్యిపెట్టుకుని తిరుగుతున్నాడు. రామ్మూర్తి తనుకూడా సరదాగా ఎయిర్‌హోస్టెస్ వెనకాల తిరుగుదామా అనుకున్నాడు. ఇంతలో వక అనౌన్సుమెంటొచ్చింది: 'మన విమానం దిగబోతోంది ... బెల్టులు పెట్టుకోండి ...' అని. విమానం దిగింది. కానీ

# ఫారిన్...

ప్రయాణీకులను క్రిందకు దిగనివ్వలేదు. విమానం నడిపేవాళ్లని దిగనివ్వలేదు. ఇంతవరకూ ఎయిర్‌హోస్టెస్ వెనకాల తిరిగినవాడు క్రిందకు దిగాడు. మరొకతనొచ్చి రివాల్వర్ పట్టుకుని తలుపుదగ్గిర నిలబడ్డాడు. ప్రయాణీకుల్లో గుసగుసలు బయల్దేరినయ్. ప్రాణాలు అరిచేతిలో పెట్టుకుని అరవకుండా కూర్చున్నారు. 'విమానం దిగినచోటు బొంబాయి మాత్రం కాద'ని గ్రహించారు. దాంతో గుండెలు వేగంగా కొట్టుకోవటం మొదలెట్టినయ్. అందరూ భయపడుతూ బాధపడుతుంటే రామ్మూర్తి మాత్రం చాలా సంతోషంగా వున్నాడు. ఈ సంతోషంలో డోర్దగ్గిర నిలబడ్డ వాడ్దగ్గిరకెళ్ళి షేక్‌హ్యాండిచ్చాడు. అతగాడు రామ్మూర్తేదో చెయ్యబోతున్నాడని భయపడి రామ్మూర్తినో తోపు తోశాడు. రామ్మూర్తి క్రింద పడి లేచి మళ్ళీ వాడ్దగ్గిర కెళ్ళకుండా దూరంగా నిలబడి—

'మనమిప్పుడు ఫారిన్ దేశంలో వున్నాం కదూ ?' అన్నాడు,

'హూఁ' అన్నాడు వాడు.

'బాబ్బాబూ ! ఏ దేశమో చెప్పు... రేపింటికెళ్ళాక నేం చెప్పుకోవాలి ... అప్లికేషన్లలో రాసుకోవాలి' అన్నాడు.

'చెప్పను' అన్నాడవతలివాడు.

'పోనీ యీ సంగతి చెప్పు...యిదిండియా కాదు కదూ ?'

'కాదు' అన్నాడవతలివాడు.

రామ్మూర్తికి మహా సంతోషమయ్యింది ...కాస్సేపాగి—

'బాబ్బాబు ... నన్నొక్కసారి క్రిందకు దిగనిస్తారా ?' అన్నాడు.

వాడేం మాట్లాడకుండా రివాల్వర్ చూపించాడు.

'కోప్పడకు బాబూ !...ఒక్కసారి యీ కాళ్ళు ఫారిన్‌దేశం మీద పెట్టి మళ్ళీ లోపలికొస్తాను...ఫారిన్ నేల మీద కాళ్ళు పెట్టినవాడి కాళ్ళు కడక్కుండా, వాణ్ణింటడక్కుండా వుద్యోగాలిస్తారు మా దేశంలో ...బాబ్బాబు...వక్కసారి నన్ను క్రిందకు దిగనివ్వండి' అని వేడుకొన్నాడు.

ఇంతలో ముగ్గురు లోపలికొచ్చారు. వాళ్ళేదో చెప్పారు. డోర్దగ్గిర నిలబడ్డవాడు సంతోషంగా వున్నాడు.

'మేమడిగింది మీ ప్రభుత్వం యిచ్చింది ...మేమింక పోతున్నాం. మీకు శ్రమ కలిగించినందుకు క్షమించండి' అంటూ వాళ్ళు వెళ్ళిపోయారు.

రామ్మూర్తి—'బాబూ! యీ విమానాన్ని మరో దేశానికి హైజాక్ చెయ్యండి' అంటూ అరిచాడు.

తను పెట్టిన గావుకేకకు రామ్మూర్తికి మెలకువ వచ్చింది. 'ఛా...ఇది కలా ?... ప్చ్' అంటూ మళ్ళీ పడుకున్నాడు. నిద్రపట్టలేదు. లేచి ప్రక్క రూం వాణ్ణి లేపి 'యిందాక కల్లో ఫారిన్ వెళ్ళొచ్చాన'ని చెప్పొచ్చాడు. వాడేదో చెప్పొచ్చాడు గానీ రామ్మూర్తదేం వినిపించుకోకుండా యింకో రూం కెళ్ళాడు.

కొన్నాళ్ళ తర్వాత అదేదో దేశంలో ఒక మారుమూల కాలేజీలో టీచింగసిస్టెంటుద్యోగం రామ్మూర్తికిస్తామని రాశారు.

'ఇదెక్కడుందో తెల్సా ?' అన్నాడు రామ్మూర్తి పద్మనాభంతో.

కాస్సేపాలోచించి — 'ఆఁ ... తెల్సుకోవటం అంతకష్టంకాదు' అన్నాడు పద్మనాభం.

డబ్బు అనుకున్నదానికంటె చాలా తక్కువొస్తున్నట్టు తోచి—

'ఫామిలీతో వెళ్లటానికిది సరిపోతుందా?' అన్నాడు రామ్మూర్తి.

'ఫరవాలేదు. అయినా అదేదో మారుమూల దేశంలోని మారుమూల ప్రదేశం కదా... డబ్బు సరిపోవచ్చు ... ఒకవేళ సరిపోకపోయినా కొంచెం కష్టపడు మరి ... 'కష్టేఫలీ' అన్నారు. అక్కడ కష్టం గురించాలోచించకు ... యిక్కడ కొన్నాళ్ళాక ఫారిన్ రిటర్న్డ్‌గా వస్తే సుఖం సంగతేమిటి?' అన్నాడు.

'యూ ఆర్ రైట్' అని రామ్మూర్తి విమానం యెక్కాడు.

(ఇంకా ఉంది)

# వస్త్రధారణలో మన పోకడలు

డాక్టర్. జి.వి. రమణయ్య

ఏప్రిల్ 15-21 లో మైసూర్ ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్స్టిట్యూషన్ వారు సిల్వర్ జుబిలీ కన్వెన్షన్ ఏర్పాటు చేసినారు. వైస్ ప్రెసిడెంట్ శ్రీ పథక్ కన్వెన్షన్‌కు ప్రారంభోత్సవం చేసినారు. రోజు మధ్యాహ్నం కొత్త ఢిల్లీలో పాదరసం 38° సెంటిగ్రేడును తాకింది. మనుషులను వదలి బయటికి రావడానికి నీడలు కూడా జంకుతున్నయ్.

చుట్టూ కలయ చూశాను. డెలిగేట్సు అందరూ కోట్లూ — టైలు — ఫులన్ ప్యాంట్లతో కనిపించినారు. ఈ నెక్ టై కనిపెట్టినవాడెవడో తెలిస్తే లాగి చెంప కాయకొట్టి 'నీ యబ్బకు పోయి చెప్పుకో!' అనాలనిపించింది. టై కనిపెడితే పెట్టాడు కనీసం ఓ 'లా' లేకపోతే కాన్స్టిట్యూషనల్ ఎమెండ్‌మెంటు చేసి పారేయించొచ్చు




కదా—వేడి దేశస్థులకు ముఖ్యంగా ఇండియన్సుకు యిది ఉపయోగించరానిదని. మన దౌర్భాగ్యం కాలికి దురద అది చెల్లదు. చుట్టుపక్కల అందరూ (నేను చిక్కుకొన్న వారనుకోండి!) చెమటలు కక్కుకొంటూ వగరుస్తూ చేతిగుడ్డల్ని (హ్యాండ్ కర్చీఫ్) వక్కాల్లో తిప్పుకొంటూ—ఆహాఃన్ అనుకొంటూ ఒకటే బాధ పడుతున్నారు. అంగవస్త్రాలను చూస్తామంటే టెరిలిన్లు, నైలాన్లు, డెకోరాన్లు, సిల్కులు — పేర్లు నాకు తెలియవనుకోండి— అయినా అలాంటి వేవో కట్టుకొని మగవాళ్ళలా కాకపోయినా ఓ మాదిరి అవస్థలోనే వున్నారు. సుకుమారీలు కావడం మరో ఇబ్బంది.

మనసులో ఓ భావం మూగగా మెదిలింది. ఈ ఎండలో పంచె, లాల్చీ లేక జిబ్బా లాంటి తేలిక దుస్తులు అయితే బావుంటుందేమోనని!

అంతకీ మన పూర్వీకులు ఏమి ధరించే వారో? మొదట్లో నార చీరలు ధరించినట్లు శాస్త్రాలు చెబుతున్నవి. ఆ తరువాత వడికిన నేత బట్టలు ఉపయోగించినట్లు చారిత్రికాధారాలున్నవి. మొగలాయీల కాలాన డెక్కా మజ్లినులు పేరెన్నిక గన్నట్లు సాక్ష్యాలు కోకొల్లలు. ఆ తరువాత ఏమయింది?

ప్యాంటు, షర్టు, టైల వయసు మహా వుంటే కొన్ని పదుల సంవత్సరాలు. బ్రిటిష్ పరిపాలన క్రింద మన వేషాల్లో మార్పులొచ్చాయి. బ్రిటిషువారిని అనుకరించాలనే దురభిమానం దీనికి కారణం కావొచ్చు; ఉద్యోగం చేసేవారు ఫలానా బట్టలతోనే

## స్వీట్ పొటాటో

కావలసినవి:—

| | | |
|---|---|---|
| ఆలుగడ్డలు (పొటాటోలు) | | 200 గ్రాములు |
| పంచదార | — | 200 గ్రాములు. |
| ఏలకులు | — | 4 లేక 5. |
| సారపప్పు | — | 20 గ్రాములు. |
| కిస్‌మిస్ | — | 10 గ్రాములు. |
| మినప్పిండి | — | 150 గ్రాములు. |

తయారుచేసే పద్ధతి:—

పొటాటోల్ని ఉడకబెట్టి పొట్టు తీసి పిండిలా గడ్డల్ని కలిపి పంచదార కూడా కలియగలిపి ఏలకుల పొడి, సారపప్పు, కిస్‌మిస్‌లు కూడా కలిపి పెట్టుకోవాలి.

పొయ్యి మీద మూకుడుపెట్టి నూనె వేడయ్యేలోగా మినప్పిండిని అట్లపిండిమాదిరిగా కలుపుకోవాలి. నూనె వేడికాగానే చిన్న సైజు పొటాటోలంత ముద్దల్ని తీసుకుని పిండిలో ముంచి నూనెలో కాల్చుకోవాలి. ఇష్టమున్నవారు నెయ్యిలోనైనా కాల్చుకో వచ్చు.

ఈ పొటాటో స్వీట్స్ తియ్యగా, ఎంతో రుచికరంగా ఉండి ఇంకా తినాలనిపిస్తాయి.

—మూర్తి శ్రీ జయసౌజన్య

ఆఫీసుకు రావాలనే ఆకాంక్ష కావొచ్చు; కాకపోతే వాటిల్లో కంఫర్ట్‌బుల్‌గా ఫీలో కావడం కావొచ్చు.

కడపట చెప్పిన కారణం కొంతవరకు నిజం—అదీ చలికాలపు డ్రెస్సింగ్ విషయంలో. కానీ—లేని బ్రిటిషు జాన్ని వ్యక్తీకరించాలని కొర్కెలు వెర్రితలలు వేయడం హాస్యాస్పదం.

చుంగుపోసి ధోవతి కట్టి పైన వల్లె వాటుతో ఎంతో బాగా చూడ ముచ్చటగా వుంటుంది కదూ ఆంధ్రదేశాన మన కట్టు. ఇంకొస్త దక్షిణం పోతే లుంగీ—చొక్కా—అవీ బాగానే వుంటయ్. ఉత్తరాదిన లాల్చీ, పైజామా లేకపోతే-లాల్చీ, ధోవతి. చూడటానికి ఇలా వున్నా కంఫర్ట్‌బుల్‌గా వుంటాయి.



ఏంటో—నాగరికత పేరుతో వ్యక్తిగత సౌఖ్యానికి పంగనామాలు పెడుతున్నాము; కోరి అసౌఖ్యాన్ని కొని తెచ్చుకొంటున్నాము; ఈ విషయంలో డిస్‌కంఫర్ట్‌కి పురోభివృద్ధి అని పేరుపెట్టి మనల్ని మోసం చేసుకొంటున్నాము. కనీసం ఇవా దుస్తులు నాకు కంఫర్ట్‌బుల్‌గా వున్నాయి, వీటిల్ని నేను వేసుకొంటాను—అనే వ్యక్తిగత అభిప్రాయ స్వాతంత్ర్యాన్ని చేజేతులా వదలిపోసు కొని ప్యాంటు, షర్టు, టైలలో—కాళ్ళూ చేతులు చక్కా నొమ్ముల్లో ఆడించుకొంటూ చెమటలో జలకాలాడుతూ గంగాజలంలో స్నానమాడుతున్నట్లు తృప్తి పొందుతున్నాము. దీంట్లోనుండి మనకి విముక్తి ఎప్పుడో! నిత్యజీవితంలో ఇలాంటి విషయాలు ఎన్నో!

# మరో ప్రేమ కథ

సావిత్రి




సూరిగాడంటే నాకెంతో ఇష్టం.

నాకు నచ్చిన స్నేహితుల్లో వీడొకడు. జీవితాన్ని చక్కగా అర్థం చేసుకుని నాలుగు రాళ్లు వెనకేసుకునే ముందు చూపున్న వాడు. నిజాయితీపరుడు.

అందుకే వాడంటే నాకు మహా పెద్ద ప్రీతి.

వాడి కొట్లోకెళ్లి ఒహో అరగంట సేపయినా కబుర్లు చెప్పుకుంటూ కూర్చోకపోతే పిచ్చెక్కిపోతుంది. వాడు మరి? వాడి స్నేహం దక్కించుకున్న నాలాంటి వాడెప్పుడూ చచ్చినా వాడి స్నేహం వదలిపెట్టడు.

ఎందుకంటే—

వాడేం చెప్పినా నిజమే చెబుతాడు. వాడేం చేసినా ధర్మయుక్తంగానే ఉంటుంది. అస్సలూ సూరిగాడి మాటల్లోనే అమృతముంది. వాడి స్నేహంలో తెల్లని వెన్నెల లాంటి చల్లదనముంది. అఫ్ కోర్స్, కొట్లోకెళ్లినప్పుడల్లా టీలకి, సిగరెట్లకి, వాటికీ— వీటికీ కొదవేం ఉండదు. కాని నేనా విషయాలను ఆశించనని మా ఇద్దరికీ తెలుసు.

అలాంటి సూరిగాడు ఉన్నట్లుండి 'ఒరేయ్ రెడ్డీ! మన మిత్రుటీ ది గ్రేట్ హానీఫ్ బంగ్లాదేశ్‌నుంచి వస్తూ పెళ్లి చేసుకుని మరీ వచ్చాట్ట!!' అన్నాడు— పళ్లన్నీ కనిపించేలా నవ్వుతూ, రాడార్‌లా నా కళ్లల్లోకి చూస్తూ.

ఆశ్చర్యపోయాను. ఈ ప్రపంచంలో మరే వింతలు జరిగినా నమ్మగల్ను. కాని ఒక అమాయకుడు, ఆడవాళ్లంటే ముచ్చెమటలతో తడిసిపోయే అపర ఋష్యశృంగుడు హఠాత్తుగా పెళ్లిచేసుకున్నాడని— అదీనూ బంగ్లాదేశ్ అమ్మాయి!

నమ్మలేకపోయాను.

కానీ, సూర్యుడు అటునుంచి ఇటు— ఇటునుంచి అటు పొడిచినా పొడవ్వచ్చు. సూరిగాడి మాటకి మాత్రం తిరుగుండదు. అందులో ఎలాంటి అబద్ధమూ ఉండదు.

'నువ్వు నమ్మటం లేదుకదూ? మొదట్లో నేనూ నమ్మలేకపోయా. నిన్న సాయంత్రం వాడింటి ముందునుంచి వెళ్తూ వెళ్తూ అలా డాబామీదికి చూస్తే, వాడు—వాడి మిసెస్సు కనిపించారు. మన అరవిందం చెబితే తెలిసింది. ఏమైనా మాంచి ఛాన్సు కొట్టేశాడు గురూ! వెన్నెల పువ్వుల్లాంటి పిల్లని తెచ్చుకున్నాడు. ఔనూ? మరచిపోయా. వాడొచ్చి ఎన్ని రోజులయ్యాయో తెలుసా?'

సూరిగాడు మరీ ముందుకి వంగి నా

C-I-B-A Cosmetics

లావణ్యం చిందే రూపం కోసం
నాజూకైన టాల్క్—
బినేలా®




బినేలా స్టార్‌డస్ట్ టాల్క్‌లో మత్తెక్కించే సుగంధం
ఉంది. రోజంతా వంటిని అంటి పెట్టుకుని ఉంటుంది.
వింతో మంచి సెంటు రాసుకున్నట్టుగా, బినేలా టాల్క్
వంటికి రాసుకుంటే అత్తరూ, సెంటూ రాసుకున్నట్టే.
బినేలా మీ లావణ్యాన్ని చిందించగల ఒకే ఒక టాల్క్.

**బినేలా®**
స్టార్‌డస్ట్ టాల్క్

CBIT-1 TEL

కళ్ళల్లో ఏదో వెదుకుతూ అడిగాడు.

తెలిదన్నట్లు తలూపాను.

'వారం రోజులకిపైగా అయిందట! ఎంతసేపు వాళ్ళిద్దరు గదిలోంచి ఇవతలికి వచ్చే సూచనలు కనిపించలేదట...'

సూరిగాడు ఇంకేదో చెబుతున్నాడు. నా మనసంతా అదోలా అయిపోయింది. వాడెంత ప్రేమించి పెళ్ళిచేసుకుంటే మాత్రం చిన్నప్పుడు గోలీలాటనుంచి ఫుట్‌బాల్‌వరకు ఆడుతూ పాడుతూ, అడపా దడపా ఒకే కంచంలో తిన్నవాడు— తన మనసులోని ప్రతిమాట అద్దంలా చెప్పేవాడు— అలాంటివాడు వచ్చి వారం రోజులైనా తనకొక స్నేహితుడున్నాడని మరచిపోయాడా!?

నా బాధ ఎలాంటిదో చెప్పనవసరం లేదనుకుంటాను.

'హనీఫ్' గాడిమీద ఎలాంటి కోపం లేదుగాని ఎందుకో హృదయంలో అదో లాంటి కలత రేగింది. క్రొత్తగా వచ్చిన ఆ అమ్మాయిమీద రవ్వంత ఈర్ష్య పుట్టుకొచ్చింది— ఆక్షణంలో.

సూరిగాడు అమాట, ఈమాట చెబుతూనే ఉన్నాడు. నేను తలూపుతూనే ఉన్నాను. కాని మనసంతా ఆ వెధవ మిలిటరీ వాడిమీదే కేంద్రీకృతమైపోయింది. ఇహ చివరికి ఓపికలేక సూరిగాడిదగ్గర సెలవు తీసుకుని బయలుదేరాను.

హనీఫ్ ఎంత అందమైనవాడో వాడిల్లు అంత అందంగా ఉంటుంది. రెండు ఫర్లాంగుల దూరంలోంచి నిల్చొని చూస్తే బాగా కనిపిస్తుంది.

వాడిల్లు దగ్గరవుతున్నకొద్దీ ఎందుకో గుండె వేగంగా కొట్టుకోవటం ప్రారంభించింది. కొంపదీసి ఆవిడగారి కౌగిల్లో, ఆ తీయని మత్తులో నేనొచ్చానని చీదరించుకుంటాడేమో? ఏమో? మిలిటరీ వాడిబుద్ధి ఏ క్షణంలో ఎలా ఉంటుందో తెల్సుకోవటం ఆ బ్రహ్మతరం కూడా కాదు.

అలా అనుకుంటూనే వాడింటిముందు కెళ్ళి కేకేసాను. ఎంతోసేపటికిగానీ వాడి మొఖం కనిపించలేదు. అదృష్టవంతుణ్నే. నన్ను చూడగానే ఎగిరి గంతేసినంత పన్జేసాడు. ఇంకా నయం. వాడంత పైనుంచి నిజంగానే క్రిందికి దూకేస్తాడేమోనని భయపడిపోయాను.

'హలో రెడ్డీ! లోపలికి రా' పైనుంచే ఆహ్వానించాడు, నవ్వుతూ. ఆ ఇల్లు నాకు పరిచయమైనదైనా ఎందుకో ఆ కాసేపు భలే సిగ్గేసింది.

మెల్లగా, తలొంచుకుని మెట్లెక్కి వెళ్ళాను.

చెయవల్సిన మర్యాదలన్నీ చేసాడు. అవన్నీ నేనేం పట్టించుకోలేదుగానీ వాడిలో ఏర్పడిన మార్పుల్ని గమనిస్తుంటే ముచ్చటేసింది. ఎప్పుడు ముభావంగా, తూచి తూచి మాట్లాడేవాడు గలగల పరువళ్ళు తొక్కే సెలయేరులా మాట్లాడేస్తుంటే ఎంతో హాయనిపించింది.

నిజానికి ఇప్పటికిగానీ వాడొక మనిషయ్యాడు. సంతోషం, ఆ సంతోషంలో అవీ ఇవీ మాట్లాడేస్తూ ఎంతోసేపు గడిపేశాం. అలా ఎంతసేపు కూర్చున్నా వాడి భార్య కనిపించకపోయేసరికి ఇహ చిరాకెత్తి 'పదరా. అలా మన పాత స్థలానికెళ్ళి కూర్చుందాం' అన్నాను.

ఆ మొఖంలో ఏవో వంకర్లు, ఆ కళ్ళల్లో నీరసం స్పష్టంగా కనిపించింది. 'నా భార్యని వదలి నేనొక్క క్షణం ఉండలేనోయ్' అంటున్నట్లున్నాయా చూపులు.

మనసులో ఏమున్నప్పటికి బుద్ధిగా నా వెంట బయలుదేరాడు— హనీఫ్.

అప్పుడే రాత్రయింది. తెల్లని వెన్నెల ఒళ్ళంతా స్పర్శిస్తూ గిలిగింతలు పెడుతోంది. చల్లని పిల్లతెమ్మెరలు కమ్మని కథలు చెబుతున్నాయి.

చదువుకునే రోజుల్లో ప్రతిరోజు ...లా జూనియర్ కాలేజ్ ముందున్న ఫుట్‌బాల్ గ్రౌండ్‌లో కెళ్ళి బాతాఖానీ కొట్టేవాళ్ళం కనీసం ఒహ గంటసేపయినా.

మామూలుగా కూర్చునే చోటే కూర్చున్నాం. ఎప్పటిలాగే నాముందు కూర్చుని చిన్న చిన్న రాళ్ళని తీసుకుని విసిరేస్తున్నాడు. నాకు తెలుసు, వాడు నాకళ్ళల్లోకి చూడలేక పోతున్నాడని, తన పెళ్ళి విషయం ఎలా చెప్పాలో తెలీక మహా హైరాన పడుతున్నాడని. నేనా మాత్రం గమనించగల్ను.

'ఔనూ? పెళ్ళి చేసుకున్నావట?' ముందు నేనే కదిలించాను.

హనీఫ్ సీరియస్ అయిపోయాడు.

'ఔను' తలొంచుకునే జవాబిచ్చాడు: రాళ్ళని మరింత బలంగా విసిరేస్తున్నాడీ సారి. ఏదో చెప్పాలని అనుకుంటున్నాడు. కానీ చెప్పలేక పోతున్నాడు. చెప్పటం ఇష్టంలేకో లేక సిగ్గు పడుతున్నాడో ఎటూ తేల్చుకో లేకపోయాను.

హరిరామ్









అతని చేతుల్లోని రాళ్లని లాక్కుంటు, 'అమ్మాయిది బంగ్లాదేశ్ అని విన్నాను.' అన్నాను. ఈమారు తలెత్తి నాకళ్లల్లోకి సూటిగ చూసాడు. ఆ కళ్ళు, ఆ కళ్లే 'అన్నీ నిజం చెబుతాయి, రవ్వంత కదిలాడు.

'రెడ్డీ! నా పెళ్లి విషయంలో అసలు నువ్వేం విన్నావో ముందుచెప్పు.'

వాడలా అడగటం నేను చెప్పక పోవటమా?

'ఏముంది? యుద్ధం ముగిసాక బంగ్లాదేశ్ అమ్మాయిని లవ్ మేరేజ్ చేసుకున్నావని

...లిగింది. అంతే...' అన్నాను మామూలు గానే.

# మరో ప్రేమకథ

వచ్చాడు.

'నేను లవ్ మేరేజ్ చేసుకున్నది నిజమే. కాదు?'

కానీ బంగ్లాదేశ్ అమ్మాయిని మాత్రం



'మరి? !'

'మనమ్మాయే, కానీ...' మధ్యలో ఆగిపోయాడు. తలని మరింత క్రిందికి వంచేసుకున్నాడు.

'ఊఁ. ఆగిపోయావేం?'

'ఆ అమ్మాయి...ఆ అమ్మాయి, ముస్లిం కాదు. నాయుండ్ల అమ్మాయి.'

'ఆఁ! ! !' ఆశ్చర్యపోయాను.

'ఏవూరు? ఎలా పరిచయమైందిరా?'

'నేను మా అత్తయ్యగారింట్లో ఉంటూ షార్ట్‌హేండ్ నేర్చుకునే రోజుల్లో ఇద్దరం చింత గింజలతో అదేదో ఆట ఆడుకునే వాళ్లం.'

ఔనౌను. అప్పుడు జ్ఞాపక మొచ్చింది. అడపాదడపా డబ్బు సరిపడలేదని ఇంటికి వచ్చినప్పుడల్లా ఆ అమ్మాయి గురించి మహా గొప్పగా చెప్పేవాడు. ఆ అమ్మాయి (అప్పటికి ఇంకా 'చిన్న' పిల్లేనట!) మాటి మాటికి వచ్చేదట. తనేమో అత్తయ్య ఏమైనా అనుకుంటుందేమోనని, ఆ అమ్మాయి దగ్గరికొస్తే చాలు ఏదో భయం కలిగేదని చెప్పేవాడు. ఒక్కోసారి అత్తయ్య రావద్దని కసురుకున్నా మళ్లీ వచ్చేదట. ఆ రోజుల్లో వాడలా భయంగా, సిగ్గు పడుతూ చెబుతుంటే నవ్వుకునేవాణ్ని.

'ఎవరూ? ఆరోజుల్లో 'పాప' అనే అమ్మాయి గురించి తెగ కబుర్లు చెప్పే వాడవి. ఆవిడేనా?'

'ఔన్నా. ఆమే, రెండు సంవత్సరాల క్రితం ట్రేడింగ్‌కి వెళ్లినపుడు బస్‌స్టాండ్ దగ్గర కనిపించింది. ఆ తరువాత రోజూ ట్యాంక్ బండ్‌లో కల్సుకునే వాళ్లం. నేను మిలిటరీ వాణ్ని. నా ఉద్యోగం ప్రమాద కరమైనదని ఎంతో నచ్చచెప్పాను. మన మధ్య కులమనే మరో ప్రమాదకర మైన అగాధముందని చెబితే అన్నింటికీ ధైర్యంగా నిల్చుంటానని చెప్పేది.' అని కాసేపాగి,

'ఇటు మావాళ్లు అటు వాళ్ల వాళ్లు ఒప్పుకోరని చెప్పాచేయకుండా పెళ్లి చేసుకున్నాం.' అని తప్పు చేసిన వాడిలా తలొంచుకున్నాడు—పెళ్లికూతుర్లా.

చల్లనిగాలి మెల్లగా వీస్తూనే ఉంది. మెయిన్‌రోడ్ మీాద వీధి దీపాలు మిణుకు మిణుకు మంటున్నాయి. ఆ మసక వెలుతుర్లో, ఆ వెన్నెల్లో వాడి ఒళ్లంతా

బరాతిలా మెరిసిపోతోంది:

'మరి బంగ్లాదేశ్ అమ్మాయిని...?'

'అదేం లేదురా, నేను పెళ్ళి చేసుకున్నానని మొదట్లో మావాళ్లందరు ఏడుస్తూ వానా హంగామా చేసినా తరువాత చల్లబడిపోయారు. కానీ ఈ విషయం మరొకరికి తెలిస్తే మా చెల్లాయి పెళ్ళి జరగదని మా నాన్నగారే అలా అందరితో చెప్పుకున్నారు.' అన్నాడు.

అదీ సంగతి ఏది ఏమైనా అమాయకుడనుకున్నవాడు మహా ఘటికుడే. లేడీస్ అంటే వెయ్యి ఆమడలదూరం పరుగెత్తే వాడు ఉన్నపళంగా లవ్‌మేరేజ్ చేసేసుకున్నాడు. ఇది కాల వైపరీత్యం.

'ఔనూ?' నేలమీద వ్రేలితో పిచ్చిగీతలు వేస్తున్న వాడి చేయందుకుని 'నువ్వు చేస్తున్న ఉద్యోగం. నీ జీతం వగైరా వగైరాలన్నీ దాచకుండా చెప్పేసావా? లేక డంబాలు కొట్టావా??'

'లేదురా అంతా నిజమే చెప్పాను.'

'అలా అయితే ఫర్వాలేదు. లేకపోతే నువ్వొట్టి డబ్బారాయుడవని ఆ తరువాత నిన్ను చులకనగా చేసుకోవచ్చు. ఏమంటావ్?' అన్నాను.

వాడు లవ్‌మేరేజ్ చేసుకున్నందుకు నా సంతోషాన్ని వ్యక్తపరుస్తూ వాడి చేయిని సున్నితంగా నొక్కాను.

హనీఫ్ తెల్లని మొఖంలో ఏవో నలుపు ఛాయలు ఆవరించాయి. నిరాశతో—

'కానీ?' అంటు ఆగిపోయాడు. గొంతులో ఏదో ఆర్ద్రత మరేదో భయం గోచరించింది.

'ఏమిటి గురూ? నీ బాధేమిటో నాతో చెప్పు, సాధ్యమైనంత వరకు శాయశక్తులా సాయంచేస్తాను.' అన్నాను అనునయంగా.

'కానీ మరో చిక్కొచ్చి పడిందిరా. మా

వాన్నగారు అన్నింటికి ఒప్పుకున్నా ఒక్క విషయంలో మాత్రం పేచీ పెడుతున్నారు.' దాదాపు ఏడుస్తున్నట్లే మాట్లాడాడు.

'ఏమిటది?'—నా ఆతురత.

"ఆవిడ పేరుమార్చి మా కులంలో చేర్చుకోవాలట!!' తలొంచుకున్నాడు. వాడి కనుకొలకుల్లో ఛటాల్న కన్నీరు చిమ్మి వట్ను గుర్తించాను.

మౌనం వహించాను. ప్రేమ పెళ్ళిల్లో వచ్చే చిక్కుల్లో ఇదొకటి, అది సహజమే.

'అలా చెప్పటం న్యాయమే?' అన్నాను.

"ఏం న్యాయమోయ్ అలా జరగటానికి వీల్లేదు.' అంత బిగ్గరగా ఎప్పుడు మాట్లాడలేదు. కోపంలో బుగ్గలు ఎరుపెక్కివట్నున్నాయి అదురుతున్నాయి.

'నేను మిలిటరీవాణ్ణి. నాలో అందం లేదు. మరి చదవంటావా అదీ అంతంత మాత్రమే. అయినప్పటికి నన్ను ప్రేమించింది. నన్ను నమ్మి తన వాళ్ళందరిని

# మరోప్రేమ కథ

వదలి వచ్చేసింది. చిన్ననాటినుంచి నుదుట బొట్టు పెట్టుకుని హాయిగా కాలేజికెళ్ళే అమ్మాయిని పట్టుకుని కులం మార్చి, పేరు మార్చి బొట్టులేకుండ బోసి మొఖంతో బురఖా వేయిస్తే ఆవిడెంత మానసికంగా కృంగిపోతుందో నీకు తెలుసా? నో నో. అలా జరగటానికి వీల్లేదు. ఏమైనా సరే. నేను మాత్రం ఆవిడ కులం మార్చను, పేరు మార్చను. ఇలాగే ఉంటాం. ఏం? బ్రతకలేమంటావా?; ఆవేశంలో అటూ ఇటూ కదిలాడు హనీఫ్.

'సరే. మీ రిద్దరు ఇలాగే ఉంటారు. మరి మీకొక్కబోయే సంతానం విషయంలో ఏం కావాలి? వాళ్ళ భవిష్యత్తు రవ్వంతైన ఆలోచించావా?'

మొహమాటం లేకుండా సూటిగానే అడిగేసాను.

'నేను బాగా ఆలోచించాను. మరీ అంత అవసరమైతే నేను పేరు మార్చుకుంటాను. అన్నింటిని వదులుకున్న ఒక దేవతని నేను బాధపెట్టలేను. ఇది అసంభవం' అన్నాడు ధృడంగా,

నవ్వొచ్చింది. నవ్వేసాను.

'విష్‌యూ బెస్ట్ అఫ్ లక్. మరి పెళ్ళి పార్టీ ఎప్పుడిస్తావురా?' ఆ పరిస్థితిలో అడగొద్దనుకుంటూనే అడిగేసా.

'ఈగొడవ తేలిపోనీ గురూ. ఒహ బ్రహ్మాండమైన పార్టీ మన వాళ్ళందరికి ఇచ్చేస్తాను.' అంటూ 'ఇహ వెళ్దామా' అన్నట్లు ఇబ్బందిగా నావైపుచూస్తు కదిలారు. ఇహ అక్కడ కూర్చుంటే వాడిక్కడున్నా మనసుమాత్రం ఆ అమ్మాయి మీదే ఉంటుందని గమనించేసి లేచి నిల్చున్నాను.

ఆ తర్వాత—రోజా ఒహ అరగంటసేపు మాట్లాడుకునే వాళ్ళం; ఆ కూర్చున్నంత కాలం ఎంతసేపు తన భార్యనే పొగిడే వాడు. తనలాంటి అదృష్టవంతుడు ఈ ప్రపంచంలో మరొకడు లేడని, అలాంటి అనుకూలవతైన అర్ధాంగి లభించిందంటే అదేదో పూర్వజన్మలో పుణ్యకార్యం చేసుకున్నానని చెప్పేవాడు. తనో హిందూ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని కలలు కనేవాడని ఆ కలలన్నీ యదార్థ

హనీఫ్ చెప్పే ప్రతిమాటని బుద్ధిగా డిసిప్లిన్‌తో కూర్చొని శ్రద్ధగా వినేవాణ్ణి. అడపాదడపా వాణ్ణి మాటల్తో పైకెక్కించే వాణ్ణి, ఆ సంతోషంలో తన భార్యని మరింత పొగిడేవాడు. నాకదో గమ్మత్తుగా ఉండేది.

ఇలా నాలుగు రోజులు గడిచిపోయాయి.

ఒకరోజు ఆలస్యమైతే వాడింటికెళ్ళాను. వెళ్ళానా? ఇంకేముంది. నన్ను చూడగానే వాళ్ళమ్మ ఒక్కపాటున ఏదో మొదలు పెట్టింది. వాళ్ళ నాన్నగారితో పోట్లాడి పెట్టె బెడ్‌తో, చివరికి చిన్ననాటి ఫోటోతోసహా తన భార్యని తీసుకుని వెళ్ళిపోయాట్ట!

ఆవిడ్ని ఎలా ఓదార్చాలో తెలీక అక్కడ కాసేపు నిల్చొని ఇహ ఉండలేక సెలవు తీసుకుని వచ్చేసాను. అంతే. కొన్నాళ్ళ వరకు వాడి సంగతేమి తెలీలేదు. అప్పుడప్పుడు సూరిగాడితో ఆ విషయమే చెప్పే వాణ్ణి.

అలా ఉండగా మా ఆవిడకి ప్రసవించే రోజులొచ్చినందుకు వూరికెళ్ళాల్సి వచ్చింది. భగవంతుని దయవల్ల అంతా సవ్యంగానే జరిగింది. వంశోద్ధారకుడే పుట్టాడు! ఆ సంతోషంలో ఇంటికి తిరిగొస్తే హనీఫ్ గాడి లెటర్ కకిపించింది.

తానేదో ఇబ్బందిలో చిక్కుకున్నానని ఎలాగైనా సరే ఒహ వందరూపాయలు పంపించమని, అలా చేయని పక్షంలో సూరిగాడి దగ్గర, అరవిందం, బాలయ్య; శేషాచారి వాళ్ళందరితోచెప్పి పంపించమని అతని ఉత్తరం సారాంశం.

ఉత్తరం మీదున్న డేట్ చూసాను.

ఆ ఉత్తరం వ్రాసి అప్పుడే ఇరవై రోజులు దాటిపోయాయి. జాలేసింది. వెంటనే సూరిగాడి దగ్గరకెళ్ళి పరిస్థితి అంతా చెప్పేసి రెండొందలు పుచ్చుకుని అతనిచ్చిన అడ్రసు ప్రకారం వెదుక్కుంటూ వెళ్ళాను. గంటసేపు వెదికి వెదికి చివరికి వాడున్న బ్లాకులో కెళితే మూడ్రోజుల క్రితమే ఖాళీచేసి వెళ్ళిపోయాడని తెలిపి ఉన్నారు మన్నాను.

స్నేహితుణ్ణి ఆదుకోవాలని ఇంత కష్టపడితే జరిగింది మరొకటి. పాపం. వాడే మయ్యాడో, ఎక్కడికెళ్ళాడో? ఎలాంటి

ఇబ్బందులు పడుతున్నాడో? మనసు చివుక్కుమంది.

ప్రేమించి పెళ్ళిచేసుకున్న మధ్యతరగతి వాళ్ళందరికి పట్టినగతే వాడికి పట్టింది. ఆ భగవంతుడే వాణ్ని రక్షించాలి. అంత కంటే మరేం కోరుకోనూ? ఇంకేం చేయనూ?

ఇంటికి తిరిగొచ్చాను.

అంతే. కాలం ఆగలేదు. అప్పుడే రెండు సంవత్సరాలు దాటిపోయాయి.

హనీఫ్‌ని మరువలేకపోయినా దాదాపు మరచిపోయినట్లే అయింది.

అయితే — ఈ మధ్యే బిజినెస్ పనిమీద మద్రాసు వెళ్ళాల్సి వచ్చింది.

పనంతా ముగించుకుని మౌంట్‌రోడ్ లోంచి వస్తుంటే ఎవరో పిలిచినట్లని పించింది. వెనక్కి తిరిగి చూసాను.

హనీఫ్! ఔను. వాడే!! వాడిప్రక్కన 'ఆ, అమ్మాయి.' ఆ అమ్మాయి చంకలో మరో పాప!!

ఆశ్చర్యపోయాను. ఒక్క అంగలో వాడి దగ్గరికి చేరుకున్నాను.

'ఏరా? కులాసా? ఎప్పుడొచ్చావి మద్రాసుకి??'

నవ్వుతున్నాడు. వాడెంతో మారిపోయినా ఆ నవ్వు మాత్రం అలాగే ఉంది.

నేనేం మాట్లాడలేకపోయాను. ఆ ముగ్గురిని చూస్తూ నిల్చుండిపోయాను; ఏదో ఆనందం. ఏదేదో కల్గింది. వాణ్ని అమాంతంగా కౌగలించుకోవాలనిపించి అది మౌంట్‌రోడ్డని గుర్తుకొచ్చి ఆ పని విరమించుకున్నాను.

'ఏంట్రా? అలా చూస్తున్నావ్!' చేయందుకొని నొక్కాడు.

తేరుకున్నాను. నవ్వాను.

నే నొచ్చి రెండు రోజులయింది. ఔను? నువ్విక్కడున్నావేం?

'అదంతా చెబుతానుగానీ ఇంటికిపద... అన్నట్లు మరచిపోయా. మా ఆవిడను నువ్వు చూళ్లేదుగా. ఆవిడ ఈవిడే. ఆ చంకలో ఉన్నది నీ కోడలు.' గర్వంగా భుజాలెగరేస్తూ నా కళ్ళల్లోకి అదోలా చూసాడు హనీఫ్.

పాప నెత్తుకొని ముద్దెట్టుకున్నాను. అచ్చం తల్లిపోలికే. ఎర్రగా, బొద్దుగా గుండ్రంగా జపాను బొమ్మలా ఉంది. ఆ పాపని ముద్దెట్టుకుంటే ఇంకా పెట్టుకోవా లనిపిస్తుంది.

ఒకప్పుడు నా మనసులో ఏమున్నప్పటికీ ఆ క్షణంలో మాత్రం హనీఫ్‌గాడు చాలా అదృష్టవంతుడని ఒప్పుకోక తప్పలేదు— మనసులో. చూడగానే గౌరవభావం కల్గించే అర్ధాంగి, చందమామలాంటి కూతురు, ఇంకేం కావాలి? అనుకున్నాను.

'పాప పేరేమిట్రా?'

'హిమబిందు;'

వాడి మొఖంలోకి చూసాను. కళ్ళు తృప్తిగా మిలమిల మెరుస్తున్నాయి. అను కున్నంత చేసేసారు. నా జేబులోని పెన్ను తీసి నోట్లోకి పెట్టుకుంటున్న 'హిమ బిందు' బుగ్గలమీద ముద్దు పెట్టుకుని ఓరగా ఆవిడవైపు చూసాను.

ఆమె హనీఫ్‌గాడివైపే చూస్తుంది. ఆ కళ్ళల్లో ఆప్యాయత, అనురాగం, ఆరాధన అన్నీ ఉట్టిపడుతుంటే - 'అదృష్ట వంతుడు' అనుకున్నాను—మరోసారి. ●







## జరిగిన కథ

తల్లికి ఇష్టంలేకపోయినా ఎం. ఎ. లో చేరాడు విద్యార్థి. తన అన్నకూతురు లక్ష్మిని విద్యార్థి వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడాలని ఆమె సంకల్పం. కాని, లక్ష్మి ఎవరినో ప్రేమిస్తున్నట్లు తెలుసుకున్న విద్యార్థి, మేనమామతో వాదం పెంచుకుని తిరిగి వచ్చేస్తాడు. మెడిసిన్ చదువుతున్న ఆనంద్ అతని రూమ్మేటు. అతని ద్వారానే సుందరి పరిచయమవుతుంది విద్యార్థికి. మామయ్య అప్పు తీర్చేటప్పటికి బాంకులో డబ్బు అయిపోయింది. ఇక ముందు చదువుగతి ఏమిటని విచారంలో మునిగిపోతాడు విద్యార్థి. గదిలో జరిగిన దొంగతనంవలన వేరే గది తీసుకుంటాడు. దైన్యం క. అతన్ని సాహసపరిగ మారుస్తుంది. ప్రైవేటుగా ఎం. ఏ. చదివే జ్ఞానాంబతో అతని పరిచయం పెరుగుతుంది. లక్ష్మి మోసపోయిందని తెలుస్తుంది. జ్ఞానాంబ విద్యార్థిని బాగా ఆకర్షించింది. అందుకే చనువు పెంచుకోసాగాడు. జ్ఞానాంబ ఆశయం విన్న విద్యార్థి ఆశ్చర్యపోయాడు. జ్ఞానాంబ మాటలతో విద్యార్థికి ధైర్యం వచ్చింది. లక్ష్మి తన కథంతా చెప్పింది జ్ఞానాంబతో. ముగ్గురూ ఒక్కటయ్యారు.

## 14

అన్నప్రకారమే పదిహేను నిముషాల్లో కాకపోయినా, అరగంటలో టిప్‌టాప్‌గా రెడీఅయి దర్శనమిచ్చాడు విద్యార్థి... కాని లక్ష్మి చీర మార్చలేదు సరికదా ... కనీసం తలకూడా దువ్వుకోకుండా పడుకుని మాటిమాటికి అమృతాంజనం మర్దిస్తోంది ...

'పోతే పోయింది పిక్చర్...ఈ పూటకు మానేద్దాం విద్యార్థిగారూ ...లక్ష్మికి తల నొప్పిగా వుందిట...రాలేనంటోంది' అంది జ్ఞానాంబ...

విద్యార్థి నీరుకారిపొయ్యాడు. అతడి వుత్సాహమంతా చప్పచల్లారి పోయింది ...

'జ్ఞానాంబగారూ ... ప్లీజ్! ... మీరు వెళ్ళండి... బావను యింతదూరం రమ్మని యిప్పుడు నిరాశపర్చడం బాగుండదు' అంది వేడికోలుగా లక్ష్మి...

'చూడండి విద్యార్థిగారూ ... అవతల ఆవిడ తలనొప్పితో బాధపడుతుంటే మనం సినిమా చూడగలమా? ... ఆనందించ గలమా?... పోనీ నా సంగతి వదిలెయ్యండి. మీరిలా బాధపడుతుంటే మీ బావగారు ఎలా 'ఎంజాయ్' చెయ్యగలరనుకున్నారు లక్ష్మీ?'

లేదు హాయిగా 'ఎంజాయ్' చేస్తాను... బ్రహ్మాండంగా 'ఎంజాయ్' చెయ్యగలను... అసలు దేముడనేవాడు లేడనే అనుకున్నాను. ఇప్పుడు వున్నాడనే అనుమానం వస్తోంది... ఇన్నాళ్ళకు ఎక్కడో ఏమూలనుండో నా మొర విని నాకు వక్కటి అవకాశం ప్రసాదించాడు ... అమ్మా! చిట్టి మరదలా!... నీ తలనొప్పి యిలాగే వుండిపోయి, యింకా ఎక్కువై పొరబాటున కూడా పిక్చర్‌కు రాకుండా వుండిపో తల్లీ ... అని పెద్దగా అరవాలనిపించింది విద్యార్థికి ... కానీ,... నిగ్రహించుకుని...

'పోనీ ఒక టాబ్లెట్ ఏమన్నా తెచ్చి యివ్వనా లక్ష్మీ?' అన్నాడు...

'వేసుకున్నాను బావా ... ఇంక నాకేం వద్దు... దయచేసి, నన్ను హాయిగా ఒక్క గంట నిద్రపోనివ్వండి ... మీకు పుణ్య ముంటుంది... జ్ఞానాంబగారూ...ప్లీజ్!... నాకు విశ్రాంతి యివ్వడం కోసమైనా మీరు వెళ్ళాలి...తప్పదు...బావా... పేంటు పాడవుతుందనుకోకపోతే ... నాకొక్క వేప కొమ్మ కోసివ్వవూ...ఆకు మాడుకేసి కట్టుకుని పడుకుంటే ... గంటకల్లా హాయిగా వుంటుంది.'

విద్యార్థి తక్షణం లేచివెళ్ళి వేపకొమ్మ తెచ్చి యిచ్చాడు...

'జ్ఞానాంబగారూ... ఏమనుకోక ... ఆ టవల్ యిలా పడేసి, ఆ లైటుతీసి, జీరో వాట్ పెట్టి, తలుపుదగ్గరగా వేసుకుని మరీ వెళ్ళండి' అంది లక్ష్మి యిక జ్ఞానాంబ మాట్లాడ్డానికి అవకాశం యివ్వకుండా ...

జ్ఞానాంబ యింక మాట్లాడలేదు ... అన్నీ లక్ష్మి చెప్పినట్లే చేసింది ... వచ్చేస్తుంటే లక్ష్మివైపు కృతజ్ఞతాపూర్వకంగా చూశాడు విద్యార్థి...

వాళ్ళిద్దరూ గేటు దాటుతుంటే కిటికీ లోంచి చూస్తున్న లక్ష్మి ఒకసారి చూచి బరువుగా నిట్టూర్చి, తల తిప్పేసుకుంది...

బయటికి రాగానే 'రిక్షా చేసుకుందామా?' అని మృదువుగా అడిగాడు విద్యార్థి...

'వొద్దండీ ... యిక్కడేగా...' అంది జ్ఞానాంబ చకచకా నడుస్తూ...

థియేటరు చేరేసరికి 'ఆట' మొదలు కూడా పెట్టారు...

ఆరుబయట ఖాళీ స్థలంలో నిలబడింది జ్ఞానాంబ ... టికెట్ తీసుకుని వస్తూ, దగ్గర్లో మల్లెపూలు అమ్ముతుంటే పూల దండ కొనేశాడు విద్యార్థి ... జ్ఞానాంబ చేతిలో పరిమళాలు వెదజల్లుతున్న మల్లెల దండ పెట్టగానే ఆశ్చర్యపోయింది జ్ఞానాంబ...

'ఎందుకివి!'

'మల్లెలు...తలలో పెట్టుకోండి.'

తనెప్పుడూ పూలంటే ఆసక్తి కనబరచలేదు. మరి యివి ఏం చెయ్యాలి?... యాంత్రికంగా తల్లో పెట్టుకుంది...

విద్యార్థి తన్మయుడై చూస్తున్నాడు... తెల్లని వాయిల్ చీరలో నల్లపిల్ల...నల్లని వాలుజడలో తెల్లని మల్లెదండ... ఆమెను చూస్తుంటే చుక్కల చీరకట్టుకున్న నిశా కాంత అందం జ్ఞప్తికి వచ్చిందతడికి...

'రండి పిక్చర్ మొదలెట్టారు.'

అన్నాడు.

లోపల జనం ఎక్కువగా లేనందున ఒక మూలగా కూర్చున్నారు యిద్దరూ...హాల్లోకి వెళ్ళగానే సినిమా చూడ్డంలో నిమగ్నురాలయింది జ్ఞానాంబ ... ఆ అమ్మాయిని చూడ్డంలో నిమగ్నుడయ్యాడు విద్యార్థి ...

మిగతా అన్ని విషయాల్లో జ్ఞాన ప్రపూర్ణ... అందరికీ సలహా లివ్వ నేర్చిన యీ పిల్లకు ప్రేమ పాఠశాలలో అ, ఆలు కూడా తెలియవు...ఇక తన మనసు యీ అమ్మాయి ముందు పర్చడమెలా?...ఆలోచిస్తున్నాడు...

ఇంతలో జ్ఞానాంబ, యిటు తిరిగి, 'భలే బాగా అందికదూ ఆ అమ్మాయి?' అంది విద్యార్థితో.

'ఏ అమ్మాయి?' చాలా తాపీగా అడిగాడు...

'బాగుంది!...యిందాకటి నుండీ ఏం చూస్తున్నారు?'

'ఏం చూస్తున్నాను!...పిక్చర్ మాత్రం కాదు.' చాలా మృదువుగా అన్నాడు...

'మరి!...ఇంతదూరం వచ్చి సినిమా చూడక?'

'ఏమి చూడ్డానికి యింతదూరం వచ్చానో...అదే చూస్తున్నాను.'

జ్ఞానాంబ అర్థం చేసుకుంది...

'విద్యార్థిగారు కవులయ్యుంటే పున్నమికి బదులు అమావాస్యను తెగ వర్ణించి వుండేవారేమో...'

'ఏం ఎందుకు వర్ణించ కూడదు?...అమావాస్య అందం అమావాస్యది...ఆనాడు మెరిసే తారకల అందం పున్నమినాడు వస్తుందా?...అమావాస్య గంభీరత మరో రోజు కొస్తుందా?...అయినా నాకు హిందీ వస్తేగా ఆ అమ్మాయి ఏమంటోందో తెలియడానికి?...పోనీ మీరు చెప్పండి...' అన్నాడు...

'ఆ అమ్మాయే కథలో నాయిక...' అంది...

'నాయిక శృంగారం ఒలకబోస్తూ వుండాల్సింది. అలా తారాజువ్వలా ఎగిరెగిరి పడుతోందేమిటి?...పాపం అతగాడే నాయకుడా ఏం ఖర్మ బిక్కచచ్చి నిలబడ్డాడేం?' చాలా దగ్గరిగా జరిగి చెవులో అడిగినట్లు అడిగాడు.

చెప్పగా తగులుతున్న ఆశ్వాస జ్ఞానాంబకు



# విద్యార్థి

గిలిగింత పెట్టినట్లయింది ... అయినా తమాయించుకుని, అంది...

'ఆ అమ్మాయి జమీందారు కూతురు. పెళ్ళంటే గిట్టదు...అతడు ప్రేమించానని వచ్చాడు...పెళ్ళి చేసుకోమని ప్రాధేయపడుతుంటే...ఆ అమ్మాయి అంటోందన్న మాట...ప్రేమా, పెళ్ళి, పిల్లలూ...యిదేనా జీవిత ధ్యేయం? ... ఇంతకంటే మరో ఆశయం మరో ధ్యేయం అనేది లేవా మానవుడికి? ... ముఖ్యంగా స్త్రీకి యివే లోకమని ఎందుకనుకోవాలి?... ఈ ప్రపంచంలో సాధించ తగ్గ ఘనకార్యాలు చాలా వున్నాయి...' అని ... బాగుంది కదా జవాబు...?'

'ఆ అమ్మాయి జవాబు నాకు నచ్చలేదు ... మనిషికి అన్నం, నీరూ ఎంత ముఖ్యమో, ప్రేమా అంత ముఖ్యం ... చమురు దీపానికి ప్రాణం పోస్తుంది ... ప్రేమ జీవితానికి వెలుగునిస్తుంది ... ప్రేమించడం, ప్రేమింపబడడం రెండూ జీవితానికి ఒకవరం... ఈ వరం లేని జీవితంలో, ఎడారిలోలానే మండుటెండలూ, యిసుక తుఫానులూ తప్ప యింకేం వుండవు జ్ఞానాంబగారూ...' అన్నాడు యింకా దగ్గరిగా జరిగి...

హాల్లో జనం చాలా పల్చగా వున్నారు కాబట్టి వాళ్ళమాటలు ఎవరికీ యిబ్బంది కలిగించేలా లేవు...

'ప్రేమ మీరన్నట్లు జీవితానికి అవసరమే కావచ్చు...కానీ అది ఒక్కొక్కసారి తలపెట్టిన మహోన్నత లక్ష్యానికి అవరోధం కలిగించవచ్చుగా ... ఉదాహరణకు ఆ అమ్మాయినే తీసుకుందాం ... ఆ అమ్మాయి లక్ష్యసాధనకు ప్రేమా పెళ్ళి యివన్నీ ఆటంకాలు కావచ్చు... అందుకే... తన లక్ష్యం తనకు తెలుసు కాబట్టి...తన మనసును అదుపులో పెట్టుకుని జాగ్రత్తగా మసులుకొంటోంది' అంది జ్ఞానాంబ...

విద్యార్థి కొంచెంసేపు మౌనంగా వున్నాడు ... అటుపైన చాలా మృదువుగా అన్నాడు...

'తనను ప్రాణ సమానంగా ప్రేమించినవాడు తన లక్ష్యానికి అడ్డువస్తాడని ఎందుకనుకోవాలి? ... అతడుకూడా ఆ అమ్మాయి ఆశయసిద్ధికి తోడుపడేవాడే అయ్యుండవచ్చుగా ... మనిషికి మనిషి తోడు... అందులో ప్రాణంగా ప్రేమించినవాడి సహచర్యంలో, తన ఆశయాన్ని త్వరలోనే సాధించవచ్చుగా ... ఒకరివల్ల కష్టసాధ్యమైనపని యిద్దరికి సులభసాధ్యం అవుతుంది గదా?...'

'నిజమే కావచ్చు...కానీ అతడు కూడా ఆ ఆశయం కోసం పాటుబడేవాడే అయ్యుండాలిగా?' ప్రశ్నించింది జ్ఞానాంబ...

'అదీ అలాగనండి...ఆ అమ్మాయి నాకు ప్రేమా పెళ్ళీవద్దు అనేకంటే ... తనకు తోడుగా ఎవరు వుంటారో పరీక్షించుకోడం మంచిదిగా ... అలా ఎన్నుకుని పెళ్ళాడవచ్చుగదా?' అన్నాడు విద్యార్థి

జ్ఞానాంబ మౌనంగా ఆలోచిస్తోంది ...

'సారీ! ... మిమ్మల్ని నొప్పించానా?...' వేదనా, మార్దవం, అనురాగం మిళితమైన స్వరంతో, మెల్లిగా జ్ఞానాంబ చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అన్నాడు...

జ్ఞానాంబలో ఒక్కసారి విద్యుత్తు ప్రవహించినట్లయింది... తొలకరి చినుకులు పడగానే పుడమిపడతి పులకరింతలోని గిలిగింతలు, అరవిచ్చిన కన్నులతో సుధాకరుడికి స్వాగతం పలికే కలువభామ మైమరపులోని తన్మయత్వం, గగనపథంలో కాదంబరీ మాలను చూడగానే, పురివిప్పిన మయూరి ఆనందంలోని వుత్సాహం...బహుశా యిలాగే వుంటాయి కాబోలు అనిపించే అనుభూతి...

ఇన్నాళ్ళూ తను బలవంతాన మూసి వుంచిన హృదయ కవాటాలను, ఎవరో తోసుకుని లోపలకు వస్తున్నట్లు మాత్రానుభవం; జ్ఞానాంబలో కొత్త సంచలనాన్ని లేవదీసినయి...

జ్ఞానాంబకు అతడి చేతిలోంచి తన చెయ్యి తీసుకోవాలనిపించలేదు... ఆస్పర్శ... మధురమైన వెచ్చని స్పర్శ... అది కేవలం వాంఛా పూరితమైంది కాదు ... తన హృదయాన్నే ముద్దగాచేసి తన చేతిలో వుంచుతున్నలాంటి భావన — నాకు నీతోడు కావాలనే అభ్యర్థన...నీకు నేను తోడుంటాననే వాగ్దానం ... కలగాపులంగా మూగ భాషలో అందిస్తున్న స్పర్శ...

విహ్వల అయింది జ్ఞానాంబ...

ఆచేతిని నెమ్మది నెమ్మదిగా తన పెదవుల దాకా తెచ్చి పెదవులతో స్పృశించాడు విద్యార్థి...

పిక్చర్ అయిపోయింది...అది సుఖాంతమే అయిందో దుఃఖాంతమే అయిందో యిద్దరూ చూడలేదు...ఎవరి భావనల్లో వారున్నారు.. హాల్లో కలకలం...ఆసాంతం వుంటే 'జన గణమన' పాడేప్పుడు ఎక్కడ లేవాల్సి వస్తుందోనన్నట్లు అప్పుడే చాలామంది జారుకుంటున్నారు...

తటాలున చెయ్యి లాగేసుకుంది జ్ఞానాంబ...

---

## విద్యార్థి

తెరమీద త్రివర్ణ పతాకం ... ఇద్దరూ లేచి నిలబడ్డారు...పాటపూర్తయ్యే సరికి హాలు యించుమించు ఖాళీ అయింది... ఇద్దరూ దిగి వచ్చారు...

'రిక్షా పిలవనా?'

'వద్దు వెన్నెల్లో నడవడం నాకు సరదా' అంటూనే బయలుదేరింది జ్ఞానాంబ...

పుచ్చ పువ్వులాంటి వెన్నెల ... వర్ణించడానికి మాటలు చాలని మనోహరమైన వెన్నెల...జ్ఞానాంబ ప్రక్కనే నడుస్తున్నాడు విద్యార్థి...అతడికి ఆ అమ్మాయిని హృదయానికి హత్తుకోవాలని వుంది...కానీ జంకు ... మౌనంగా నడుస్తున్నారు యిద్దరూ...

'పరీక్షలయ్యాక సెలవుల్లో యిక్కడే వుంటారా?...' నిశ్శబ్దతను భంగపరుస్తూ అడిగాడు...

'ఊహుఁ ... యీ పరీక్షలకోసమే ఆగిపోయ్యాను ... ఆఖరిపరీక్ష అయిపోగానే చెక్కేస్తాను...ఇంటి దగ్గర అమ్మా అక్కయ్యా వదినా వాళ్లను చూసేదెప్పటికో మళ్లీ ... అదీకాక పని వుందిగా ... దాన్ని మర్చిపోతే ఎలా?...చాలా మంది విరాళాలు యిస్తామని ప్రామిస్ చేస్తున్నారు...ఇప్పుడే వెళ్లి వసూళ్లు చేసుకోవాలి...పని ప్రారంభించాలి...ఇక్కడుంటే ఎట్లా?.'

'నన్ను తోడురమ్మంటారా?.'

'తోడా?...ఎందుకండీ?'

'అదే మీరు విధితో తలపెట్టిన యుద్ధంలో మీకు సాయం చెయ్యడానికి... యుద్ధం ఒక్కరే చెయ్యలేరుగా ...' అన్నాడు...

'ఫర్వాలేదు...ఈ యుద్ధం నేనొక్కదాన్నే చెయ్యగలను...నాకా ధైర్యం వుంది... విధేకాదు...అంతకంటె పెద్ద శత్రువైనా సరే ఓడిం చెయ్యగలను.'

'మరీ అంత ఒంటరిగా యుద్ధం చేస్తే చివరికి తెల్లజెండా చూపించాల్సి వస్తుందేమో...'

'నో క్వశ్చెన్ ఆఫ్ వైట్ ఫ్లాగ్ ... తెల్లజెండా ప్రసక్తేలేదు విద్యార్థిగారూ... విజయమో ... వీరస్వర్గమో... అంతే ...

ఇంతకూ మీ ప్లాన్ చెప్పనేలేదు.'

'మీతో రావద్దన్నారుగా... చెప్పండి ఏం చెయ్యమంటారో?' మెల్లిగా అడిగాడు విద్యార్థి మళ్ళీ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ...

'నా సలహా వింటారా?... అయితే పరీక్షలు కాగానే మీవూరెళ్ళిపోయి, ఆ పొలాలు పూర్తిగా పరాయివాళ్ళమీద వదిలెయ్యకుండా...నారుమడి ... దుక్కి దున్నించడం లాంటివి వుంటాయేమో చూసుకొంటూ దగ్గరుండి' అంది. అప్పటికే యిద్దరూ జ్ఞానాంబ గది దగ్గరకు వచ్చేశారు.

## విద్యార్థి

"మీ అడ్రసు యివ్వండి ... సెలవుల్లో ఉత్తరం వ్రాస్తాను' అన్న విద్యార్థికి,

'నా అడ్రసా? ఏక్షణాన ఏవూర్లో తిరుగు ప్రయోజనం? ... ఇంకా మీ అడ్రసు యివ్వండి... వీలుంటే మీ వూరుకూడావచ్చి తుంటానో... మీరు వుత్తరం వ్రాసి ఏం డబ్బులు పోగుచేస్తాను' అన్నది జ్ఞానాంబ.

'ఓ...అవశ్యం...' అంటూ నిర్జనంగా వున్న ఆ ప్రదేశంలో టాటా చెబుతున్న జ్ఞానాంబ చేతిని మరోమారు ముద్దు పెట్టుకుని వదిలేశాడు విద్యార్థి...

ఆ తర్వాత భోజనం కానిచ్చి పుస్తకం తీసుకున్న జ్ఞానాంబను ప్రవాహంలా వచ్చి ముంచెత్తాయి ఆలోచనలు... తనలో వచ్చిన మార్పు, ఆ నూతనోత్సాహం తల్చుకుంటే ఆశ్చర్యం వేసింది జ్ఞానాంబకు ... ఇదే మిటి ? ... తనెందుకిలా బలహీనపడి పోయింది? తనను ఎవర్కైనా ప్రేమించా అనే కోరిక తనలోనూ అంతర్గతంగా వుందా యిన్నాళ్ళూ?...అందంగా లేనందున ఎవ్వరూ ప్రేమించరని, తన చుట్టూ గోడలు కట్టుకుని నేనెవర్నీ ప్రేమించటం లేదని బుకాయిస్తూ తిరుగుతోందా? ... ఎందుకిలా తన మనసు వశం తప్పింది?... నిజంగానే విద్యార్థి తన ఆశయసిద్ధికి తోడు పడాలనుకుంటున్నాడా?...ఇది ఎంత వరకూ సాధ్యపడుతుంది? ... అతడే ఒకరి తోడు కావాలనుకునే పరిస్థితిలోవుంటే... అతడు తమాషాకన్న విషయాన్ని పట్టుకుని తన మనసెందుకిలా ఆశల సాలెగూడు అల్లుకుంటోంది?...ఇత్యాది ప్రశ్నలు కుప్ప తిప్పలుగా వచ్చి పడుతున్నాయి...

అంతలోనే ... అనవసరంగా లేనిపోని ఆశలు పెంచుకోని నిరాశల పాలయ్యే కంటే ముందే జాగ్రత్తపడడం మంచిది... తను ఒకరిని ప్రేమించడానికి గానీ, ఒకరి చేత ప్రేమింపబడదానికి గానీ పుట్టలేదు... అనే నిశ్చయానికి రావడంతో ఆలోచనల ప్రవాహానికి ఆనకట్టకట్టి బలవంతంగా పుస్తకం వైపు మళ్ళించింది మనసును జ్ఞానాంబ...

ఒక మహా ప్రవాహానికి పెనురాయి అడ్డుపడి, అది కాస్త పక్కకు తొలిగినట్లే తొలిగి మళ్ళీ యథాస్థానానికి వచ్చినట్లు యింది జ్ఞానాంబ పరిస్థితి...

ఆ మర్నాడు విద్యార్థి వాళ్ళ వూరికి వెళ్ళాల్సి వచ్చింది ... పరీక్షలని ఎంత చెప్పినా, మేనల్లుడి బారసాలకు తప్పక అతడు రావాల్సిందేనని పట్టు బట్టారు వాళ్ళ బావగారు. వాళ్ళమ్మా అక్కయ్యలు కూడా బలవంతం చెయ్యడంతో వెళ్ళక తప్పలేదు. వెళ్ళినవాడు పరీక్షలు రేపనగా

మాత్రమే రాగలిగాడు. పరీక్షలు అయి పోయ్యాయి. ఫస్టుపేపరు రాసిన రోజున యిక మిగతాపేపర్లు రాయడం కూడా దండుగేమో ననిపించింది విద్యార్థికి...

'షేక్స్పియరు' పేపరు మాడలు పూర్తిగా మార్చేశారు... కైమ్ములేక అయిదు డ్రామాలకుగానూ మూడు డ్రామాలు మాత్రమే చదివి వెళ్ళిన విద్యార్థి బాగా దెబ్బతిన్నాడు...పరీక్ష పాసవుతాననే ఆశ ఏ మూలా లేకుండానే యిల్లు చేరు కున్నాడు విద్యార్థి...

* * *

జూన్, జులై నెలలు గడిచాయి...ఆరోజు ఆగస్టు పదిహేను. సాయం సమయాన హోలీపండుగరోజున వసంతం కొట్టినట్లుంది ఆకాశం. తూర్పుదెస నీలం, మధ్య ఎరుపూ తెలుపూ కనకాంబరపు రంగు మబ్బులు. పడమటికి పోను పోనూ కుంకుమ

# విద్యార్థి

పూజచేసినట్లు రక్త వర్ణంలో వున్న ఆకాశాన్ని చూస్తూ పొగడ చెట్టుకింద చాపవేసు కూర్చుని, ఒళ్ళోవున్న పొగడపూలను ఒక్కటొక్కటే గుచ్చుతున్న లక్ష్మి, గేటు తీసుకుని లోపలకు వస్తున్న విద్యార్థిని చూడగానే ముఖం విప్పారి,

'హల్లో బావా! ... హార్టీ కంగ్రాచ్యులేషన్సు!' అన్నది...లోపలికి వెళ్లి కుర్చీ తెచ్చి పొగడచెట్టుకింద వేసింది...

కుర్చీలో కూర్చుంటూనే, 'హార్టీకండో లెన్సెస్ చెప్పాల్సిన వేళప్పుడు కంగ్రాట్స్ ఎందుకు చిట్టి మరదలా?...' అన్నాడు విద్యార్థి నవ్వుతూనే...

'ఎందుకా?...ఈ ఏడు కనీసం సగానికి సగం కూడా పాసవని మీ డిపార్టుమెంటులో నువు పాసయినందుకు ... రేపో ఎల్లుండో ఫీజుకట్టి ఫైనలియర్‌లో చేరబోతున్నందుకు...తెలిసిందా?...అందుకు ... కాబట్టి పార్టీ ఎగ్గొట్టే స్టంటులు మానేసి నడు... జ్ఞానాంబగార్ని నన్నూ ముందు ఐస్ పార్లర్‌కు తీసుకెళ్లి ఐస్‌క్రీమ్ పెట్టించి అటు నుంచీ పిక్చర్‌కు తీసుకెళ్లు...' అంది లక్ష్మి నాన్‌స్టాప్ ఎక్స్‌ప్రెస్‌లా యింకా మాట్లాడుతూనే...

'అన్నట్లు జ్ఞానాంబగారేరీ? ... 'వచ్చినప్పటినుండీ కళ్లు తనకోసమే వెతుకుతున్నా అడగడానికి అప్పటికి అవకాశం దొరికిన విద్యార్థి అడిగాడు...

టవల్‌తో ముఖం తుడుచుకుంటూ, వాళ్ల సంభాషణ విని నవ్వుతూ బయటకు వస్తున్న జ్ఞానాంబను చూసి కూడా లక్ష్మి నవ్వుతూ,

'మరే మేలో వెళ్లిపోయి ఆ గస్టు పదిహేనుని కనబడుతున్న పెద్ద మనిషితో మా జ్ఞానాంబగారు మాట్లాడుతారేమిటి?' అంది.

'అబ్బే అడ్రసు అడిగినా యివ్వనివాళ్లకు ఏ అడ్రసుకు వ్రాయాలో అడక్కపోయ్యావా మీ జ్ఞానాంబగారినే...' అన్నాడు నవ్వుతూనే విద్యార్థి...

'అబ్బ అడ్రసు తెలిసి యిక్కడే పడున్న వాళ్లకు 'చచ్చావా బ్రతికావా' అని ఒక్క కార్డుముక్క వ్రాయలేదు కానీ...అడ్రసు తెలియదని బుకాయింపూ...' అంది యింకా సాధిస్తూనే...

అప్పుడే వచ్చి కూర్చుంటున్న జ్ఞానాంబతో, 'జ్ఞానాంబగారూ! ... మీ జోస్యం ఫలించింది...ఇద్దరం పాసవుతామన్నారు... పాసయ్యాం...మీరు ఫైనలియర్ బుక్స్ కొనేశారా?...' అని అడిగాడు ఆత్మీయత కూడిన చనువుతో...

'ఇంకాలేదు...అయినా నిన్ననేగా రిజల్ట్సు వచ్చింది ... 'బుక్స్‌లిస్ట్' కూడా తెలియదాయె...ఇంతకూ మీరెప్పుడు ఫీజు కట్టబోతున్నారు?' అన్నది పొడిగానే, విద్యార్థికి దూరంగా వుండాలని తను చేసుకున్న నిర్ణయం ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తూ...

'నేనా?...లేదు... నేను ఫీజు కట్టడానికి రాలేదు...ఇదిగో ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజిలో పేరు రిజిస్టరు చేసుకోడానికి వచ్చాను.'

'అదేం? !...' అన్నారు లక్ష్మి జ్ఞానాంబా యిద్దరూ ఆశ్చర్యంగానే...

'అది అంతే...అలా వచ్చాయి పరిస్థితులు మానెయ్యదల్చుకున్నాను ... మానేస్తాను. జ్ఞానాంబగారూ. మీకు కావాలంటే మా ఫ్రెండ్స్ నడిగి పుస్తకాలు తెచ్చి యిస్తాను ...చదవండి...' అన్నాడు చాలా సీరియస్‌గానే...

అతడు తమాషాకు కాకుండా నిజంగానే అంటున్నాడని తెలియగానే జ్ఞానాంబా, లక్ష్మి యిద్దరూ నిశ్చేష్టులయ్యారు...

'ఏమిటి బావా...ఎందుకు మానేస్తున్నావ్?' అంది లక్ష్మి...

'ఎందుకా మా అమ్మ అంటుంటుంది లే... గీతలో లేందే గిల్లుకున్నా రాదని... అందుకు.'

'ఛట్!... నాన్సెన్స్! ... ఆమాట అనకండి విద్యార్థిగారూ ...మనం కోరుకున్నట్లుగా మారుతయి మనచేతిలో గీతలు ... వుయ్ ఆర్ ది మాస్టర్స్ ఆఫ్ అవర్ ఫేట్! ... ఏనాటివో చద్దిమాటలు చెప్పకండి...' అంది జ్ఞానాంబ చాలా ఆవేశంగా...

'జ్ఞానాంబగారూ...ఒకనాడు నేనూ మా అమ్మమీద యిలా ఎగిరిపడినవాడినే... కానీ యిప్పుడు అనిపిస్తోంది మనం విధి చేతిలో కీలుబొమ్మలమేనేమో అని... మనం ఎంత ప్రయత్నించినా...'

మాట మధ్యలో అడ్డువచ్చింది లక్ష్మి ... 'ఇంతకూ అసలేం జరిగిందో చెబుదూ సస్పెన్సుతో చంపక' అంది విసుగ్గా...

'క్రొత్తగా ఏమీ జరగలేదు ... అనుకున్నదే...నేను ప్రీవియస్ పరీక్షలు రాయక ముందే చెప్పానుగా వచ్చే సంవత్సరం నా చదువు సాగడం కష్టమని ... అయితే అప్పుడు షేక్స్‌పియరు పేపరు చూసి అసలు పాసవననే అనుకున్నాను ... ఇప్పుడు పాసయి మానేస్తున్నాను ... అంతే తేడా... ఎక్కడైనా ఓ జాబ్ చూసుకోవాలి ... అందుకని 'ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి'లో రేపు పేరు రిజిస్టరు చేయించుకుందామని వచ్చాను ... రేపు ప్రొద్దున్నే మీరిద్దరూ వుండరు గదానని ... వూరునుండి రావడం రావడం యిటే వచ్చాను...

'సరే వస్తాను...ఇంకా సత్యం దగ్గరకు వెళ్ళాలి ... మళ్ళీ రెండురోజుల్లో ఒకసారి వస్తాను... అప్పుడు ఫ్రెండ్సుదగ్గర లిస్టు తీసుకుని మీకిస్తానండి' అంటూ కుర్చీలో నుండి లేచాడు విద్యార్థి...

(ఇంకా వుంది)




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press ( & 9, Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3. Editor : S. Radhakrishna.



విరాళాల వీరయ్య
వస్తున్నాడు!
మీ జేబులు జాగ్రత్త!
దేనికా పరుగులు? వెనక సిటీబస్సు వస్తోందా?
లేదు! విరాళాల వీరయ్య వస్తున్నాడు!
ఈ శ్రావణమాసంలో పట్టు చీర కొనకపోతే-పుట్టింటికి పోతా!
మొన్ననేగా అగ్నిబాధితుల నిధిలో-గాజులు వేయించాను! వరదలు రానీ-
ఏమిటండీ? ఆ విరాళాల వీరయ్య అడగ్గానే అయిదు రూపాయలిచ్చారు?
ఇవ్వకపోతే ఇచ్చేవరకూ-వాడు ఇక్కడే మకాం వేస్తాడు! ఇంకా ఎక్కువ వదుల్తుంది!
ఆ ఎదురింట్లో కొత్తగా దిగిన-ఆతనికి ఏం ఉద్యోగం? ఎప్పుడూ చాలా హడావుడిగా వుంటాడు?
సీజన్ వారిగా విరాళాలు పోగు చేస్తుంటాడు! ఈ మధ్యనే ఆ ఇల్లు కొన్నాడట!
యాచక వృత్తి నిర్మూలనకై ప్రభుత్వం తీవ్ర చర్యతీసుకుంటు...
వాళ్ళకిచ్చేది అయిదు పైసలూ, పదిపైసలేగా! విరాళాల వీరయ్యల సంగతేమిటి?
విరాళం
వర్షాలే లేవుగా! వర్షబాధితుల నిధి..ఏమిటయ్యా వీరయ్యా!
వర్షాలు లేవని మానేస్తే ఎలా? దాతలకి..అలవాటు తప్పిపోతుంది! అందుకని వచ్చా! తప్పదు!

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

